Sri P. PUNDARIKAKSHACHARYULU —: అధ్యక్షా! Budget చర్చ సందర్భంలో కొన్ని కొన్ని డిమాండ్లమీద చర్చ సాగించడానికి అవకాశం లేకపోయింది. అందచేత, ముఖ్యమైనవి కొన్ని విషయాలు చెప్పదలచుకొన్నాను Supplementary demands గురించి మాట్లాడుతూ ఆర్థికమంత్రిగారు కొన్ని irrigation schemes కు గాను అంచనా వేసినంత మొత్తం ఖర్చు కాలేదన్నారు. యిరిగేషనుకు సంబంధించినంతవరకు, మళ్ళీ కోరే పద్ధతి కాకుండా అంతా ఖర్చుపెట్టి ప్రజలకు మేలు చేకూరుస్తారని ఆశిస్తున్నాను. ఈ సందర్భంలో, ఖర్చు కాక పోవటానికి, ఎందుకు ఖర్చు కాలేదో ఆలోచించుకోవాలి. మా జిల్లా నుండి వచ్చిన ప్రతి శాసన సభ్యుడుగూడ ప్రతిమాటూ చెప్పుతూనే వున్నాడు. మా జిల్లాలో జమిందారీలు రద్దు అయిన తరువాత పబ్లిక్ వర్క్సులోని మైనర్ యిరిగేషనుకు చాలినంత Engineering తగిన staff లేకుండా పోయింది. మేము ఏమైనా అడిగితే—ఎగ్జిక్యూటివ్ ఇంజినీరుగారు 'Staff లేదు ఏమి చేస్తాము' అని అంటున్నారు. మా విశాఖపట్నం, శ్రీకాకుళం యీ రెండు జిల్లాలలో యిరిగేషనుకు సంబంధించినంతవరకు తగిన staff ను ఏర్పాటు చేస్తారని ఆశిస్తున్నాను. బొబ్బిలి, శిరిపురం ఎస్టేట్లలో యిరిగేషనుకు రివర్ ఛానల్సు వున్నవి. వీటి విషయం శ్రద్ధ తీసుకుంటే, కొంతవరకైనా బాగుంటుంది. బొబ్బిలి ఎస్టేటులో రెగిడి వాయన్న మొదలగు ఛానల్సు వున్నవి. రెండు పంటలు పండేవి. ఇక్కడ పండిన పంటను ఇతర జిల్లాలకు పంపించడానికి గూడ వీలయ్యేది ఇప్పుడు మొదటి క్రాప్ పండించటానికే నీరు చాలటం లేదు. తోటపల్లి రెగ్యులేటరును గురించి బొబ్బిలి రాజాగారు, దావా గూడ జరిపారు. జనవరి 1 లగాయితు జూన్ 30 వరకు క్రిందికే అంగా రేటిలోనే పూర్తిగా నాగావళి క్రింద కాల్వలకు వదలి వెయ్యమని తీర్పు చెప్పారు. నీరు యిబ్బంది యేర్పడి, యిప్పుడు నీటి కొరకు వాయన్న గడ్డ ప్రజలు ప్రభుత్వానికి కొన్ని విజ్ఞప్తులు చేశారు. త్రాగటానికి నీరు లేకపోవటాన్ని గురించి శ్రీ సంజీవరెడ్డిగారికి చెప్పాను. వారు ఆలోచిస్తామని చెప్పారు. రెండవ క్రాప్‌కే కాకుండా, మంచినీటి సప్లయికి priority యిస్తూ పనులు గూడ జరిగేటట్లు చూడవలసినదిగా కోరుతున్నాను. వంశధార ప్రాజక్టును గురించి చాలామంది మాట్లాడారు. ప్రభుత్వంగూడ తగు చర్యలు తీసుకొనుచున్నందుకు చాలా సంతోషిస్తున్నాను. నాగావళికి గొయిపాక ఏజన్సీలో ఒక రిజర్వాయర్ కట్టే స్కీము వున్నదని Chief Engineer చెప్పారు. జంఝావతీ నదికి గూడ ఒక రిజర్వాయర్ కట్టుతూ, అలాంటే వంశధార రిజర్వాయరు కట్టితే, వంశధార నాగావళీ జాయింటు స్కీముక్రింద శ్రీకాకుళం జిల్లా అంతాగూడ బాగుపడుతుంది. జమీందారులు వారి స్వంతపనులకోసం, కొన్ని రోడ్లను వేసుకున్నారు. ఇప్పుడు జమీందారీలు రద్దు అయిన తరువాత ఆ రోడ్ల మరమ్మతుల సంగతి ప్రభుత్వంగాని, జమీందారులుగాని చూడటం లేదు. ప్రజలకు అవసరమైన ఈ రోడ్లను ప్రభుత్వం వశపర్చుకొని తగిన సదుపాయాలు చేయమని కోరుతున్నాను. జమీందారీ ఎస్టేట్లలో పెద్ద పెద్ద బిల్డింగులు వున్నవి. వీటిని స్వాధీనంచేసుకుంటే, ప్రజలకు చాలా వుపయోగంగా వుంటుంది. ఈ buildingsలో బేసిక్ ట్రయినింగ్ స్కూల్సును, బోర్డులు స్కూల్సును మొదలగు వాటిని పెట్టవచ్చును. జమీందారీలు రద్దు అయిన తరువాత అక్కడి ప్రజలు వుండటానికి ఆధారం లేక వలసపోవలసిన పరిస్థితులు ఏర్పడుచున్నవి. ఆ ప్రజలకు కొంత నిలువనీడ ఏర్పాటు చేస్తారని ఆశిస్తున్నాను. Land reforms ను గురించి ఏమీ

చెప్పనక్కరలేదు. ఇసాం రైతుల విషయంలోను, కౌలుదారి రక్షణ విషయంలోను ప్రభుత్వం తగు ఏర్పాట్లు చేస్తుందని ఆశిస్తున్నాను.

తిరుపతిలో ప్రత్యేకమైన విశ్వవిద్యాలయం పెట్టదలచుకొన్నప్పుడు,రాయలసీమ కాలేజీలను యీ విశ్వవిద్యాలయంలో affiliate చేస్తారనేది ఒకసమస్యగా వున్నది. ప్రస్తుతం ఈ affiliation విషయం గురించి ఆలోచించవద్దని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ముందు ముందు ప్రభుత్వము కొన్ని జిల్లాలను ఏర్పాటు చేయటానికి యిష్టమున్నట్లుగా తెలుస్తున్నది. (ఒంగోలు - మార్కాపురం జిల్లాలుగా వాళ్ళే ఉద్దేశ్యం) ఇంకవల్ల జ్యూరిస్డిక్షన్ తేడాలు నిర్ణయించుకొనవలసి వుంటుంది. కాబట్టి, తిరుపతిలో నెలకొల్పే విశ్వవిద్యాలయం మామూలుగానే వుంచవలెనని, రాయలసీమ కాలేజీలను యిందులో affiliation చేసేపద్ధతి ప్రస్తుతం ఆపివేయవలసినదని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆ కాలేజీలను ఆంధ్రయూనివర్సిటీకే అనుబంధం చేయాలి.

Sri N. SIVARAMA REDDI :— అధ్యక్షా, Budget సమావేశాలు ముగుస్తున్నవి. మనమంతాగూడా ఊళ్ళకు వెళ్ళిపోతున్నాము. కాని, ఇంకా, కొన్ని ముఖ్యమైన సమస్యలు పరిష్కారం కాకుండా వున్నవి మన గ్రామాలకు వెళ్లుతున్నాము. ఈ budget సమావేశంలో సాధించింది ఏమిటి అని, అక్కడ ప్రజలు అడుగుతారు. ముఖ్యంగా రాయలసీమలాంటి జిల్లాలలో కరువుతో 4 సంవత్సరములనుండి బాధపడుతున్న రైతాంగాన్ని యీనాడు గవర్నమెంట్ అప్పులు కట్టమని చెప్పి చాలా బాధిస్తున్నారు. జప్తులు తీసుకొని వస్తున్నారు. చాలామందికి డిమాండు నోటీసులు యిచ్చారు. ఈ విషయం ప్రభుత్వ దృష్టికి తెచ్చాం. మంత్రిగారిని కలుసుకొని మా జిల్లా తరఫున మెమొరాండము యివ్వటంగూడ జరిగింది. దీనిని గురించి, ప్రభుత్వం ఎట్టిప్రకటన చేయలేదు. ఇంకా యీపద్ధతిలికొనసాగిస్తూనేవుంటుందా ప్రభుత్వం అని అడుగుతున్నాను. మళ్ళీ ఎప్పుడో ఒకనెలతరువాత సమావేశం కాబోతున్నాం. Budget పూర్తి అయింది. ఈ కర్మకాండ అంతా ముగుస్తున్నది. ఈ అప్పులను కొంతకాలము వరకు వాయిదా వేయాలని కోరుతున్నాను, లేనిచో గ్రామాలలో చాలా ఆందోళన పరిస్థితులు ఏర్పడ గలవని చెప్పి ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నాను.

పోతే, ఇక నిరుద్యోగసమస్య చాలాగ్రామాలలో విపరీతంగా ఉన్నది. ఈ సంవత్సరము పండినటువంటి పంట చాలా తక్కువ. ఎక్కడైనా కొద్దిగా పండినట్లైన, అటువంటి ప్రదేశాలకు ప్రజలు వలసవెళ్ళడం అక్కడ ఉన్నటువంటి స్థానిక కూలీలకు కూడ పని దొరకకపోవడం, ఈ విధంగా మొత్తం రాష్ట్రంలో అంతటా గూడ నిరుద్యోగము సంభవించింది. ఈ పరిస్థితులలో, విశ్వనాథంగారు మాట్లాడుతూ పెట్టుబడులక్రింద 14 కోట్లు ఖర్చుపెడుతున్నామని, దాన్ని ఉపయోగించినట్లైతే, నిరుద్యోగ సమస్య పూర్తిగా తీరుతుందని అన్నారు. అంకెలలో పోతూయున్నదేమో గాని, ఆచరణలో నిరుద్యోగసమస్య తీరినట్లు కన్పించదు. కాబట్టి గ్రామాలలో ఉన్నటువంటి నిరుద్యోగులకు, వ్యవసాయకూలీలకు పనులు చూపించే పద్ధతి ఏమిటి అని అడుగుతున్నాను. ఇప్పుడు ముఖ్యంగా Electricity schemes మొదలగు పెద్దప్రాజెక్టుల కొరకు డబ్బు కేటా యిస్తున్నారు. ఇది గ్రామాలలోని నిరుద్యోగ సమస్యను ఏవిధంగా పరిష్కారం చేస్తుందని

అడుగుచున్నాను. వీరు K. C. Canal కు కొంతడబ్బు కేటాయించారు. కాని K. C. Canal క్రింద ఈ సంవత్సరం పని జరగలేదు. అదేవిధంగా యీ ఉదయం ప్రశ్నల సమయంలో సాగిలేరు ప్రాజెక్టు త్వరలో ప్రారంభిస్తారా అని అడిగితే, దానికి తృప్తికరమైన సమాధానం లేగు. దానికి 44 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి ఈ నిరుద్యోగసమస్యను ఏమైనా పరిష్కరిస్తారా అంటే, అటువంటి ఆశకూడ కన్పడలేదు. కాబట్టి ఈ నిరుద్యోగ సమస్య పరిష్కారం చేయాలంటే, minor స్కీము లన్నింటిని వెంటనే తీసుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ముఖ్యంగా కమలాపురం తాలూకాలో చిన్న చిన్న చెరువులకు నీటి సప్లై లేకపోవడంవల్ల అక్కడి ఆయకట్టుదారులు దెబ్బతింటున్నారు. తలమర్ల మొదలగు కొన్నిచోట్ల, కట్టకాలవలు కట్టడానికి investigations పూర్తి అయినాయి. కాని పనులు మాత్రము తీసుకోలేదు. ఈ వ్యవహారమంతా Chief Engineer దగ్గర నిలబడిపోయింది. ఇదేవిధంగా, పులివిందల తాలూకా వేములనాయుని చెరువుకు గూడ కాలువ కట్టిస్తే, అక్కడి ఆయకట్టదారులకు లాభము కలుగుతుంది, పరిసరప్రాంతాలలో ప్రజలకు నిరుద్యోగంపోయి పనులు కలుగుతాయి. తరువాత famine roads అన్నీ నిరుపయోగమై, ప్రయాణానికి ఆటంకంగా తయారయినాయి అని చెప్పితే అందులో అతిశయోక్తిలేదు. అటువంటి రోడ్లన్నిటినీ concrete చేసే పనులు తీసుకోవలెనని ప్రభుత్వాన్ని కోరుచున్నాను. ఇంకొక ముఖ్యమైన విషయమున్నది. తుంగభద్రా రిజర్వాయరులో ఉన్నటువంటి నీటిని మన ప్రభుత్వము సరిగా ఉపయోగించడానికి ప్రయత్నం చేయలేదు. ఆ నీరంతా నిరుపయోగంగా ఉంటున్నది. K. C. Canal పనితీసుకొని దానిద్వారా ఆయకట్టులకు నీరుసప్లై చేయడానికి ఈ ప్రభుత్వము ఆలోచన చేయకుండా, ఆయకట్టుదారులకు ఎటువంటి సౌకర్యాలు కలుగజేయకుండా ఉన్నది. ఆ నీరంతా నిరుపయోగంగా ఉన్నది. సంజీవ రెడ్డిగారికి నేను, పుల్లారెడ్డి ఈ విషయం గురించి నివేదించడం జరిగింది. చూస్తామన్నారు. కాని ఏమి జరుగలేదు. K. C. Canal scheme ను అమలు పరిస్తే, దానివల్ల అభివృద్ధి జరుగుతుంది. కాని ఈ విషయమై దీనిని ఎప్పుడు తీసుకొంటారని Chief Engineer ను అడిగితే యీసంవత్సరం యీ K. C. Canal scheme ను అమలు జరపడానికి వీలులేదు, ఈ సంవత్సరం దానికి కావలసిన material ను gather చేయడం contract settle చేయడం మొదలయిన పనులు చేయబడతాయి అని చెప్పారు.

తుంగభద్రలో floods వచ్చేదానికి ఇంక 3 మాసాలున్నది. కనుక ఈ సంవత్సరమే K. C. Canal పని తీసుకొని ఎక్కువపంట పండించే అవకాశాన్ని ప్రభుత్వము కలుగ జేస్తుందా ఆ విధంగా రైతాంగానికి తెలియ జేస్తుందా అని అడుగు చున్నాను. ఈ విధంగా ప్రకటన చేయడానికి వీలులేదు అని చెప్పతున్నారంటే తుంగభద్రాబోర్డును గురించి ప్రభుత్వము గట్టిగా పని చేయడంలేదని దీనివల్ల బాగా స్పష్టంగా కన్పడుతుంది. ఆవిధంగా నీరు సప్లైచేసి నట్లైతే రైతాంగానికి మేలుజరుగడమే కాకుండా ప్రభుత్వానికి కూడ నీటి తీరువక్రింద కొన్నిలక్షల రూపాయలు వచ్చే అవకాశమున్నది. ప్రభుత్వము ఇంకా పెద్ద పెద్ద స్కీములను తీసుకు రాబోతున్నది. కాని ప్రారంభించినదాన్ని ఆలస్యం చేయడం, investigation అయిన తరువాత మళ్ళీ investigation చేసి sanction చేయడం ఇవన్నీ అయిన తరువాత ప్రతిసంవత్సరం డబ్బు కేటాయించడం, తరువాత ఎదో ఒక Dam construct చేయడం, తరువాత దానినుంచి కాలువలు ద్వారా ఆయకట్టలను అభివృద్ధి చేయడానికి 20

సంవత్సరాలు పడుతుంది అంటే ప్రజలకు ఈ ప్రభుత్వం కట్టేటటువంటి Projects వల్ల ఎటువంటి ప్రయోజనము లేకుండా పోతున్నది. తుంగభద్రా ప్రాజెక్టు అనకట్ట కట్టడం పూర్తిఅయినప్పటికి ఈనాడు ఆయకట్టు దారులకు ఉపయోగము లేకుండా ఉన్నది. ఆ ఆయకట్టును అభివృద్ధి చేయడానికి గాను, కాలువలు త్రవ్వడానికి ప్రభుత్వము ఎటువంటి ప్రయత్నం ఇప్పటికీ చేయలేదు. తుంగభద్ర Hydro Electric Scheme ఉన్నది. దాని ప్రకారము, 22 Sub Stations 700 మైళ్ళ పొడుగున line construction జరుగవలసి యున్నది. ఈ పని ఇదివరకెప్పుడో చేస్తామని చేయలేదు. అటువంటప్పుడు ఇది యీ సంవత్సరం అమలుకు వస్తుందంటే విశ్వసించడానికి వీలులేదు. కాబట్టి నేను చెప్పునది ఏదైనా ఒక scheme తీసుకొన్నటైతే, దాని గురించి అన్ని పరిశీలనలుచేసి వెంటనే పనిజరగడానికి చర్యతీసుకోక పోయినట్లైతే అది తీసుకొన్నప్పటికీ దానివల్ల ఎటువంటి ప్రయోజనము ప్రజలకు కలుగదని మనవిచేస్తున్నాను.

Sri M. RAJESWARA RAO :— అధ్యక్షా ! ఈ Appropriation Bill ను పురస్కరించుకొని, ఒకటి, రెండు విషయాలు చెప్పదలచుకొన్నాను. ఇదివరకు general debate లో చెప్పినట్లు, మన దేశంలో వున్నటువంటి సంపదను సరియైన పంపకం చేయడం, తరువాత సరియైన taxation ద్వారా సంఘములో వున్నటువంటి inequalities ను తగ్గించి, ప్రస్తుతము ఒక ప్రక్కన పెట్టుబడుదారులకు, మరొక ప్రక్కన పేద ప్రజానీకానికి మధ్యన వున్నటువంటి gulf ను ఎక్కువ చేయకుండా, వున్నదాన్ని కూడ తగ్గించేటటువంటి విధానాన్ని అనుసరించవలెనని మనవి చేస్తున్నాను. మరొకసారి ఈ విషయములో ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నాను. ఇదివరకు 1946 సంవత్సరములో ప్రకాశం పంతులుగారు Chief Minister గా వున్నప్పుడు, వారు అమలులో పెట్టినటువంటి Producers - Cum-Consumers Co-operative Societies ను మళ్ళీ revive చేసినట్లైతే, ఈ లక్ష్యానికి చాలా దోహదం చేస్తుందనే విషయాన్ని ప్రభుత్వము గ్రహించి, ఈ సొసైటీలగురించి పునరాలోచించవలెనని కోరుతున్నాను. ఇక District Administration గురించి చెప్పవలసివస్తే దీనిలో village officers చాలా ప్రధానంగా వుంటున్నారు. Administration అంతా వీరి ప్రవర్తనమీద ఆధారపడి యుంటుంది. అసలు హరిజనులకు మొట్టమొదటి శత్రువు ఎవరంటే, యీ village officers అనే చెప్పవలసి యుంటుంది. అందుచేత ఈ village officers ను heriditary గా నియమించే విధానాన్ని రూపుమాపాలని, ప్రభుత్వము ఈ విషయాన్ని త్వరలో పరిశీలిస్తారని అనుకొంటున్నాను. ఈ జిల్లా పరిపాలనలో చాలా efficient people ను, I. C. S. వారిని నియమించి, వీళ్ళకు అధికారాలు ఎక్కువ చేస్తే బాగుంటుంది. తరువాత డిప్యూటీ కలెక్టర్లు, రివిన్యూబోర్డు మొదలగు అనవసరమైన ఆఫీసులను త్వరలో abolish చేసి, అవసరమైతే, N. G. O. staff ను అభివృద్ధి చేయవలెనని మనవి చేస్తున్నాను. అదే విధంగా ప్రస్తుతం ప్రభుత్వ సర్వెంట్సులో efficiency ని అభివృద్ధి చేయటానికీ, red-tapism తగ్గించటానికీ, యిప్పుడు అమలులో వున్న Tottenham Scheme కు good-bye చెప్పి, వేరే less cumbersome procedure వుంటే దాన్ని అవలంబించి, యిప్పుడు చేసేటటువంటి disposals లో వున్న ఆలస్యములను అరికట్టటానికి ప్రభుత్వము కృషి చేయాలి.

N. G. Os. ప్రభుత్వ పరిపాలనలో ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. వీరివిషయం ప్రభుత్వం తగు జాగ్రత్త తీసుకోవలసి వుంటుంది. వారు జీతాల అభివృద్ధి కోరు

తున్నారు. పరిస్థితులు ఎప్పటికప్పుడు మారుతున్నపుడు, cost of living ఎప్పుడు కూడా proportinate గా హెచ్చుతూ తగ్గుతూ వుంటుంది. అట్లాంటప్పుడు cost of living ను పట్టి వీరికి జీతాలు అభివృద్ధి చేస్తేనేగాని, వీరికి ప్రభుత్వ పరిపాలనా కార్యక్రమ నిర్వహణలో, నిరుత్సాహపడకుండా వుండరు. వారి జీతాలు revise చేయాలని కోరుతున్నారు. అందరికి ఒకే రకమైన scales of pay introduce చేస్తే మంచిదని నా అభిప్రాయము.

తరువాత జిల్లాలో పనిచేసే ప్రభుత్వాధికారులలో ఒకరొకరికి మధ్య సన్నిహిత సంబంధం వుండేటట్లు ఏర్పాటు చేయాలి. లేకపోతే, యీ ప్రభుత్వ కార్యక్రమములో తేడాలు, ఆలస్యాలు జరుగుతుంటవి. దీనివల్ల ప్రజలు చాలా యిబ్బంది పడుతున్నారు.

రాష్ట్రములో 10 ఏళ్ళు, 14 ఏళ్ళు మధ్యనున్న వయస్సు గలవాళ్ళు ఎందరో వుంటున్నారు. వీరు విద్య లేకుండా వుంటున్నారు. ప్రభుత్వం నూతన విద్యా విధానం ప్రవేశపెట్టాలని అంటున్నది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో నున్నప్పుడే, యీ నూతన విద్యా విధానము అమల్లోకి వస్తుందని ఆశించాను. వీరందరికి విద్యకుగాను ఏర్పాట్లు చేస్తే, వారికి తగిన జీవనోపాధి సంపాదించుకోటానికి శక్తి కలిగించినట్లవుతుంది. ఈ విధంగా విద్య లేకుండా ఎంతోమంది వుండుటవల్ల, చాలా వెనుకబడినవారవుతున్నారు. ప్రస్తుతము ప్రభుత్వమువారు అవలంభించే education policy వల్ల నిరుద్యోగ సమస్య రోజు రోజుకు తీవ్రతరమైపోతున్నది. ప్రతివారు చదువుకొని ప్రభుత్వోద్యోగం చేయటానికి కాచుకొంటున్నారు. ప్రభుత్వము ఎంతమందికని వుద్యోగములు provide చేయగలదు? అందువల్ల విద్యాభ్యాస కాలములోనే ప్రతి ఒక్కరికి వివిధ రకాల profession కు తయారయ్యేటట్లు విద్య నేర్పించి, ప్రభుత్వోద్యోగము కావాలి అనే glamour తగ్గించాలి. ఉదాహరణకు cottage industries తీసుకోండి. పిల్లలకు చిన్నతనమునుండి యీ పరిశ్రమకు కావలసిన విద్య నేర్పించి, యీ పరిశ్రమకు పనికి వచ్చేటట్లు చేస్తే, యిందులో తయారైనవారు స్వతంత్రశక్తితో జీవనము చేయగలరు. అంతేకాని ప్రతివారు బి. ఏ. చదివి, ప్రభుత్వము అఫీసులచుటూ తిరుగుతూవుంటే, ప్రయోజనము యేమిటి? ఇటువంటివారు లెక్కపెట్టలేనంతమంది వుంటున్నారు. కాబట్టి ప్రభుత్వము పరిశ్రమలు మరేఇతరఅవస్యకమైన పనులను వేరువేరుగా విభజించి, విద్యార్థులను రకరకాల categories లో తయారుచేస్తే, యీ నిరుద్యోగ సమస్య తీరిపోక ఏమవుతుంది? విద్యార్థులుగా వున్నప్పుడే వీరిని విద్యలో రకరకాల శాఖలలో తయారు చేయాలి.

తరువాత విద్యాబోధన చేసే teachers కు జీతాలు చాలనందున, వారు పిల్లలకు విద్య నేర్పడము అంతంతమాత్రంగా కన్పిస్తున్నది. ఈ రోజులలో ఏ 2, 3 పరసెంటో సరిగా విద్య నేర్చుకుని ఉత్తీర్ణులౌతున్నారు. చాలా మంది మధ్యలో మానివేసినవారు వున్నారు. కాబట్టి teachers కు సరియైన encouragement కలుగజేస్తే, విద్యార్థులకు విద్యాభ్యాసము ఉత్సాహపూరితముగా నేర్పుదురు. పూర్వకాలములో విద్యకు ఈరోజులలో చెప్పేవిద్యకు చాలా తేడా వున్నది. Efficieney తగ్గిపోయింది. Teachers కు ఉత్సాహము పుట్టించి, సరియైన బాధ్యతవారి నెత్తిన వేయాలంటే, వారికి ముందు జీతాలు పెంచాలి. అప్పుడు వారి శక్తినంతా వినియోగించటానికి వారికి ఆసక్తి కలుగుతుంది. జమీందారి ఏరియాలల్లో

అసలు విద్యఅంటే ఏమిటోగూడా తెలియనివారు వున్నారు. ఉపాధ్యాయులకు జీతాలు యిస్తేగదా, వాళ్ళు పిల్లలకు విద్యనేర్పుతారు. ఇప్పుడు జిల్లాబోర్డులోవిగాని, మునిసిపల్ మేనేజమెంటులోవిగాని, ప్రైవేటు మేనేజమెంటులోవిగాని, స్కూళ్ళ మేనేజిమెంటు ప్రభుత్వమన్నీ స్వాధీనము చేసుకోవాలి. కాకపోతే, ఉపాధ్యాయులకు జీతాలు ప్రభుత్వమే disburse చేయాలి. ఉద్యోగాలు యివ్వడములో District Educational Officer కు అధికారమిస్తే చాలా మట్టుకు, యీ education policy ముందుకు వస్తుంది. ప్రభుత్వము యిటువంటి మార్పులు చేయకపోతే, Education క్రింద ఖర్చుచేసేది వృధాఅనే చెప్పగలను. ఈ పద్ధతి మలబారులో జరుగుచున్నది. అంతే కాకుండా S. S L. C. వరకు అక్కడ ఉచిత విద్యను యిస్తున్నారు. అక్కడ ఎంతమంది చదువుకున్నవారు వున్నారో, మనరాష్ట్రములో ఎంతమంది వున్నారో లెక్కవేస్తే తేలుతుంది. కాబట్టి అదేవిధంగా మన రాష్ట్రములోగూడా S. S. L. C. వరకు ఉచితంగా విద్యాబోధనచేయాలి. నిర్బంధ విధానము అమలులోకి తేవాలి పంతుళ్ళకుజీతాలుపెంచి ప్రభుత్వమే జీతాలు disburse చేయాలి. Appointment అధికారము District Edu●ational Offi‿er కు యివ్వాలి. అంటే మేనేజిమెంటు ప్రభుత్వము తీసుకుంటేనేగాని, యీ Education అనేదిముందుకురాదు. లేకపోతే ప్రభుత్వము దీనికిగాను ఖర్చుచేసేదివృధాఅని అంటాను. ముఖ్యంగా ప్రైవేటు మేనేజిమెంటులోవున్న స్కూళ్ళలో teachers కు నెలల పర్యంతం జీతాలు యివ్వని కేసులు ఎన్నో వున్నవి. బైటస్కూళ్ళకు 35, 40 రూపాయలు యిస్తూంటే, యీ ప్రైవేటు స్కూళ్ళలో వచ్చేగ్రాంటుతో 16, 17 రూపాయలు జీతాలక్రిందయిస్తూ, మిగతాది మేనేజర్లు కాజేస్తున్నారు. ఇటువంటి instances ఎన్నో నేను ప్రభుత్వదృష్టికి తేగలను. ఇటువంటివి జరుగుతూండబట్టే, టీచర్లకు నిరుత్సాహముపుట్టింది. పిల్లలకూ, విద్యలేదు. నేను చెప్పిన విధంగా ప్రభుత్వము యీ స్కూళ్ళను మేనేజిచేస్తే, పంతుళ్ళు జవాబుదారీ వహిస్తారు. పిల్లలకు teachers యందు ఎందుకు భయము వుండదు? Teachers ప్రభుత్వానికి భయపడతారు. ఈ విధంగాచేస్తే unemployment problem కూడా చాలామట్టుకు solve కావటానికి అవకాశాలు వున్నవి. కాబట్టి educational institutions, వాటి మేనేజిమెంటు విషయములో ప్రభుత్వం వెంటనే తగినమార్పులు చేస్తుందని ఆశిస్తూ, విరమిస్తున్నాను.

Sri. A. VENKATARAMA RAJU:— ఈ బడ్జెటు సమావేశంలోనూ ముఖ్యంగా గతసమావేశములోనూ, కూడా Irrigation Demand ను గురించి చర్చ రాకుండా పోవటమువల్ల కొన్ని చిక్కులు ఏర్పడ్డవి. ముఖ్యంగా మా గోదావరి డెల్టాప్రాంతాలకు సంబంధించి నంతవరకు ఎన్నో విషయాలు ప్రభుత్వ దృష్టికి తేవలసియున్నది. దీని విషయము చర్చకు రాకపోవడము ఏమిటోనని నేను అభిప్రాయపడుతున్నాను. గోదావరి డెల్టాక్రిందవుండే irrigation schemes ను గురించి గతసమావేశములో ప్రభుత్వ దృష్టికి తెచ్చాను. ప్రభుత్వము దాని విషయము యేచర్య తీసుకోలేదు. మరల యీసారి సమావేశంలో గూడ నేను ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను. గోదావరి డెల్టాక్రింద సుమారు 11 లక్షల యకరాలభూమి సాగు అవుతున్నది. ఈ డెల్టాలో రెండవపంట విషయములో ఒక పెద్దరాజకీయ సమస్యవచ్చి, ప్రజలను ఎంతో నష్టపరుస్తున్నది. 1947 వ సంవత్సరములో ప్రభుత్వమువారు

localization scheme ప్రవేశపెట్టాలని చూచి, ఆరు సంవత్సరాలు అయిన తరువాత యీ స్కీమును ప్రవేశపెట్టుతామని అప్పటి ప్రభుత్వమువారుచెప్పారు. ఇప్పుడు 1953 వ సంవత్సరముతో యీ ఆరు సంవత్సరముల కాలము అయిపోయింది. ఇప్పుడు second crop వేసే విషయములో అనేక రాజకీయ సమస్యలు అడ్డు వస్తున్నవి. విశ్వనాథంగారికి అన్నియు తెలుసును, ఆయనే ప్రభుత్వమువారిని వప్పించి యీ స్కీము అమలులోనికి తెచ్చే ఏర్పాటు చేస్తారని ఆశించాము. కాని అట్లుజరుగలేదు. ఈ సంవత్సరములో నైనా ఆస్కీమును అమలు పెట్టించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత Remodelling scheme విషయము వున్నది. మా గోదావరినుంచి నీటిపారుదల విషయములోనే కాకుండా రాష్ట్రంలో అన్నిచోట్లనుగూడా regulators యిప్పటికి పది సంవత్సరాల క్రిందటనే కట్టివేయడం జరిగింది. నీరును సరిగా regulate చేయడములేదు. ప్రజలు ఎవరు డబ్బుయిస్తే P. W. D. irrigation శాఖవారు వాళ్ళకు సహాయముచేస్తున్నారు. భూస్వాములుఆయినవారు వారిపలుకుబడిని వుపయోగించుకొని వారి యిష్టము వచ్చినట్లుగా high level లో వున్న నీటిని వుపయోగించు కోవడం జరుగు చున్నది. అందువల్ల చాలామంది ప్రజలు నష్టపడుతున్నారు. Remodelling scheme రావటానికి డెల్టా భూముల రైతులందరు అంగీకరిస్తున్నారు. ప్రభుత్వము యీ స్కీములు ఎందుకు అమలులోకి తేగూడదు అని అడుగుతున్నాను. నోరుగలవాళ్ళదే రాజ్యము అన్నట్లుగా యిప్పటి పరిస్థితులు జరుగుచున్నవి. ప్రభుత్వము రైతులందరిని ఒకే దృష్టితో చూడడములేదు. పెద్ద భూస్వాములకు నీరు అందడము, మిగతా వారికి అందక పోవడము జరుగుచున్నది. ఈ irrigation సమస్య త్వరలో ప్రభుత్వమువారు పరిష్కరిస్తారని ఆశిస్తున్నాను. డాములు యిదివరకే కట్టడం జరిగింది. కనుక ఈ remodelling scheme త్వరలో అమలు పరచమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. జిల్లా కలెక్టరు క్రింద Irrigation Department వున్నది. ఇందులో పాక్షిక విధానము జరుగుచున్నదని అంటున్నాను. అందుచేత ప్రజా ప్రతినిధులుగా వచ్చిన మేము ప్రజలకు సమాధానము చెప్పవలసి యున్నది. ఈ సమస్యను పునరాలోచించి త్వరలో ప్రభుత్వము పరిష్కరిస్తుందని ఆశిస్తున్నాను.

ఈ సందర్భములో నేను ఒక ఉదాహరణ చెప్పదలచాను. మా రాజోలు తాలూకాలో గుడిమూల రామేశ్వరము అనే దేవాలయము వున్నది. దానికి ఎన్నో వందల ఎకరాల భూములున్నవి. దేవస్థానము భూముల విషయములో దేవస్థానమునకు వ్యతిరేకంగా కోర్టుజడ్జిమెంటు వచ్చింది. దేవస్థానమునుంచి చాలా సొమ్ము రావలసి యున్నది. ఈ సొమ్ము అక్కడవున్న high school కు వినియోగించితే బాగుంటుం దని నా అభిప్రాయము. ఈ దేవాలయమునకు చాలా వరుంబడిరాగలదు. ఈ ఆదాయ ములో కొంతభాగము యీ హైస్కూలుకు వినియోగించాలని నా అభ్యర్థన. ఈ సొమ్ము రాబట్టడానికి ప్రభుత్వము తగుశ్రద్ధ వహించాలని యీవిషయము వారిదృష్టికి తెస్తున్నాను.

శ్రీ ప్రకాశంపంతులుగారు యీ ప్రాంతములో tour చేసే సందర్భములో అక్కడవున్న field labour co-operative society సంగతి వచ్చింది. కోఆపరేటివ్ రిజిష్ట్రారు యీ సొసైటీ విషయములో ఎంతవరకు పని చేసిందిన్నీ ఒక statement చెప్పియున్నారు. ప్రభుత్వము తలపెట్టిన పనులన్నియును: యీ లేబరు సొసైటీద్వారా చేయించాలని నా అభిప్రాయము. అలాచేస్తే లేబరు Interest కాపా

డటమే కాకుండా ప్రభుత్వమువారి పనులుగూడా సక్రమంగానే నెరవేరగలవు. Highways Department గాని, Public Works Department గాని అనేక రకాల పనులు జరుపుతున్నది. ఈ పనులన్నియు యీ సొసైటీద్వారా నడిపిస్తే ఎలాంటి యిబ్బందు లుండవు. ఈ విధంగాచేస్తే నిరుద్యోగ సమస్య నివారణకు పూర్తిగా దోహద మిచ్చిన వారగుదురని ప్రభుత్వము యిందులో తగు శ్రద్ధ వహించాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri K. V. RAMESAM :— అధ్యక్షా ! విశాఖపట్నం జిల్లానుంచి వచ్చినటువంటి శాసనసభ్యులకు ఈ బడ్జెట్ చాలా నిరుత్సాహం కలిగించిందని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను. ఆ మధ్య మంత్రులు చాలామంది విశాఖపట్నం చాలా వెనుకబడి ఉందనీ, అక్కడ సరిగా నీటి వసతులు లేవని అక్కడ దాదాపు ఒక కోటిరూపాయలు ఖర్చుపెట్టడానికి ప్రయత్నం చేస్తున్నాం అని చెప్పడం వల్ల ప్రజల్లో ఆశకలిగింది. అయితే ఈ బడ్జెట్ వివరాల్లో మాత్రం మా జిల్లాకు అనుకూలమైన పనులు ఏమీ కనుపించకపోవడం వల్ల అక్కడున్న ప్రజలకు చాలా నిరుత్సాహం కలిగించారు. ఒక విషయం మాత్రం గమనించవలసి ఉంది. ఇందులో minor irrigation క్రింద కొంత ధనము కేటాయించడం జరిగింది. ముఖ్యంగా గవర్నమెంట్ చేతుల్లో ఉన్నటువంటి ప్రాంతాల్లో కొంతపని జరుగుతున్నది కాని ఎస్టేట్స్‌లో ఉన్నటువంటి ప్రాంతాల్లో ఇది వరకు జమీందార్లు ఏమీ చేయలేదు, గవర్నమెంట్ వారూ యేమీ చేయలేదు. కాబట్టి ఇక్కడ ఉన్నటువంటి మైనర్ ఇర్రిగేషన్ పనులకు ప్రాధాన్యత ఇవ్వమని, ముఖ్యంగా విశాఖపట్నంజిల్లాకు ప్రాధాన్యత ఇవ్వమని కోరుతున్నాను. అలాచేస్తే అక్కడ ఉన్నటువంటి ప్రజలకు ఉత్సాహం కలుగుతుంది.

మార్చి 1 వ తేదీ తరవాత కొన్ని పనులకు కేటాయించిన మొత్తం ఖర్చు కాకుండా మిగిలిపోవడం జరుగుతున్నది. సరైన ఎస్టిమేట్లు లేకపోవడంవల్ల ఈడబ్బు మిగిలిపోవడం చాలాఅన్యాయం. కాబట్టి ఈ Department లన్నీ సరైనఎస్టిమెట్స్‌వేసి కేటాయించిన మొత్తం మిగిలిపోయి తిరిగి ప్రభుత్వానికి జమకట్టేట్టు కాకుండా, కేటాయించిన యావత్తు మొత్తం ఖర్చు అయ్యేట్టుచేసి పనులు పూర్తయ్యేట్టు చేయవలసి ఉంటుంది.

ఎలక్ట్రిసిటీ మాచ్‌కండ్ 1954 వ సంవత్సరంనుండి వస్తుందని చెప్పారు. చోడవరంనుంచి మాడుగులవరకు ఎలక్ట్రిసిటీ ఎక్స్టెంషన్ లైన్ వేస్తారని చెప్పారు. వీటి విషయంలో శ్రద్ధవహించ వలెనని కోరుతున్నాను. Appropriation చేసేప్పుడు డబ్బు పూర్తిగా ఖర్చు అయ్యేట్లు చూడాలి. ఎస్టేట్ లాండ్స్ గురించి ఒక విషయం గుర్తించాలి. అక్కడ సర్వే సెటిల్‌మెంట్ కాకపోడంవల్ల ప్రత్యేక డిప్యూటీతహసీల్‌దారును వేసి ఇది వ్యవహరించబడుతున్నది. ఈవిధంగాచేయడంవల్ల administrative inconveniences కలిగి ప్రజలు చాలాబాధపడుతున్నారు. కాబట్టి తహసీల్‌దారుఅజమాయిషిక్రిందదీన్ని ఒక administrative unit గా ఏర్పాటుచేసి irrigation కు సంబంధించిన పనులు ఈ తాసీల్‌దారుచేత జరిపించాలి.

ఎక్సైజ్ డిపార్టుమెంటు విషయంలో ఇంతవరకు యే నిర్ణయం ప్రభుత్వం చేయలేదు. దానివిషయంలో ఇప్పుడే alternative స్కీము తయారుచేయించి అందుకు తగిన ఏర్పాట్లు ఇప్పుడే నిర్ణయించాలి. Sanction అయిన మొత్తం ఏ విధంగా ఖర్చయిందో

గించవలసి ఉంటుందో ఆ విధంగాచేస్తేకాని ఆ పద్దుక్రింద గ్రాంట్ కాబడని మొత్తం వినియోగం కావడంకష్టం. ఇదివరలో కంపోజిట్ స్టేట్‌లో ఉండగానే District మున్సిఫ్ కోర్టు విషయములో 3 వేలనుంచి 5 వేలవరకు పెంచుతాంఅని చెప్పారు. కాని అది ఇంతవరకు జరగలేదు. ఇప్పుడైనాసరే 3 వేల నుంచి 5 వేలవరకు పెంచమని లా మినిష్టరుగారిని కోరుతున్నాను. దానికిసంబంధించిన విషయాలు హైకోర్టుకు కాని జిల్లాకోర్టులకుకాని పంపించమని కోరుతున్నాను.

Sri B. SANKARAYYA :— అధ్యక్షా ! గత బడ్జెట్ సమావేశంలో అనేక పద్దులమీద చర్చించే అవకాశం లేకపోయింది. ఆంధ్రదేశానికి ప్రధానమైన ఇర్రిగేషన్ డిమాండుమీద చర్చించడానికి వీలులేకుండా పోయింది. ఈ ప్రభుత్వం ఆంధ్రదేశ అభివృద్ధి దృష్టిలోపెట్టుకొని ఇర్రిగేషన్ విషయంలో ప్రణాళికలు వేయడంలేదు. శ్రీ సంజీవరెడ్డి గారిని అడిగితే నందికొండ విషయంలో ఆలస్యం చేయడంలేదు హైదరాబాదు మాత్రమే ఈ నందికొండ విషయంలో ఆలస్యానికి కారణం అని చెప్పారు. హైదరాబాదులో అక్కడ ఉన్న ఇంజనీర్లను కలుసుకుంటే మా ఆక్షేపణ ఏమీ లేదు, 590 అడుగులు కాకపోతే 610 అడుగుల ఎత్తున కట్టుకొన్నా మా అభ్యంతరం ఏమీ లేదని చెప్పారు. నందికొండ తుంగభద్ర హైలెవల్ ఛానలు గండికోట K. C. canal రిమోడలింగ్ ఆంధ్రదేశంలో కరువు ప్రాంతాలను సుభిక్షం చేస్తాయి. ఇతర స్కీములను తరవాత తీస్కోవచ్చు. ఖోస్లాకమిటీవారు కె. సి. కెనాలును ఆరువేల క్యూసెక్కుల కెపాసిటీకి రీమోడల్ చేస్తే కడప, కర్నూలు, జిల్లాలలో ఉన్న కరువు ప్రాంతాలు, నెల్లూరు జిల్లాలో నీటిఎద్దడితో బాధపడుతున్న ప్రాంతాలకు నీటిసప్లయి చేయడానికి వీలౌతుందని చెప్పితే designs సరిగా లేవని ఆంధ్ర ప్రభుత్వము అంటున్నది. ఇండియాలో కల్లా పెద్ద experts పరిశీలనచేస్తే వాళ్లు చెప్పినవాటిని అమలుజరపడంలేదు. మైనర్ ఇర్రిగేషన్ స్కీంసు విషయంలో ఒక పద్ధతి లేకుండా చేస్తున్నారు. మద్రాసులో ఉండగానే అధికార తీర్మానంలో కనిగిరి రిజర్వాయరును రీమోడల్ చేయమని అడిగితే వెంటనే చేస్తామని రంగారెడ్డిగారు, ఇరిగేషన్‌మంత్రి హామి ఇచ్చారు. నెల్లూరు ప్లానింగు బోర్డు ఏకగ్రీవంగా కనిగిరి సప్లయిఛానెల్‌లో పెద్దది చేయాలని కనిగిరి రిజర్వాయరు రీమోడల్ చేయాలని తీర్మానించింది. ఇది పెద్దస్కీంసులో ఒకటి. ఇందుకుగాను ఒక సబ్‌డివిజన్ ఏర్పాటుచేయాలని కోరింది. దీనిక్రింద ఒక లక్ష ఎకరాలు సాగౌతుంది. ఈ గ్రామాల్లో ఇదివరకు రిమిషన్ కూడా ఇవ్వవలసి వచ్చింది. కాని ఈ బడ్జెట్‌లో ఆవిషయం ఏమీలేదు. ప్రభుత్వం తాను ఇచ్చే హామీలు గాని, ఇంజనీర్లు, జిల్లా ప్లానింగ్‌బోర్డులు ఇచ్చే సలహాలుగాని పాటించకపోడంవల్ల ఎందుకు అనవసరంగా ఈ Food Committee Meeting కు పోడం అనిపిస్తున్నది. ఏ విధంగా ఈ స్కీంసుకు ప్రయారిటీ ఇస్తోందో చూస్తే ఒక సక్రమమైన పద్ధతి లేదని తెలుస్తున్నది.

ఇర్రిగేషన్ విషయంలో అవి చిన్నదైనా, పెద్దదైనా పక్షపాతం లేకుండా చేయాలి. మైనర్ ఇర్రిగేషన్‌కి కేంద్ర ప్రభుత్వం grant యిస్తే, మీరు మైనర్ ఇర్రిగేషన్ కొరకు ఖర్చు పెట్టడంలేదు. కావలి తాలూకాలోగాని, నెల్లూరు జిల్లాలో గాని వున్న ఇనాందారీ ప్రాంతాల్లో చెరువులు మరమ్మత్తు చేయకపోవడం వల్ల, ఆ యా గ్రామాల్లో వున్నటువంటి రైతులు గ్రామాలను విడిచిపెట్టి వెళ్ళవలసిన పరిస్థితి వున్నది. చెరువులు మరమ్మతు లేనందువల్ల అక్కడ నివసించడానికి వీలులేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఇక పోలీసు డిపార్టుమెంట్ విషయం తీసుకుంటే నేను parliament

సభ్యుడు నానాదాసు, Dy. S. P. ని తీసుకొని వెళ్ళి లేగుంటపాడు గ్రామములో విచారణ చేసి రాజీ చేశాము.

అయినప్పటికి ఆ రోజు విచారణలో పాల్గొన్న కూలీలపై సెక్యూరిటీ కేసు బనాయించమని సదరు Dy. S. P. చెప్పినట్లుగా తెలుస్తోంది. మా సమక్షంలో జరిగిన విచారణలోనే అక్కడ case ను represent చేసిన రైతులను కూలీలను భయపెట్టడానికి అనేకవిధాల ప్రయత్నాలు జరిగాయి. పొదిలి సర్కిల్ ఇన్స్పెక్టరు విషయంలో యిదివరకే మనవిచేయబడింది. కర్నూలు రైతు యాత్రికుల విచారణ సందర్భంలో గ్రామాల మీద పడి అసలు యాత్రలో పాల్గొనని అనేకమందిని అరెస్టుచేసి బెదరిస్తున్నారు. దీనిని విచారించడానికి సీనియర్ ఆఫీసర్ను వేశామంటున్నారు. అక్కడ స్థానికంగా వుండే సర్కిల్ ఇన్స్పెక్టరు దౌర్జన్యంగా కర్నూలుకు రానటువంటి వారిని కూడా పేర్లుయిచ్చి అరెస్టు చేయించినట్లు మొన్న జాబు వచ్చింది. దానిని యిక్కడ చదివి వినిపించాము. మా జిల్లాలో వున్న డి. యస్. పి. ని మాస్తే సర్కిల్ ఇన్స్పెక్టరుకు గాని, యితర సబార్డినేట్ ఆఫీసర్లకుగాని లక్ష్యంలేదు. మేము సామాన్యంగా కాస్తకి, కూస్తకి పోలీసు ఆఫీసర్ల దగ్గరకు పోము. కాని ఫలానా సర్కిల్ ఇన్స్పెక్టరు దౌర్జన్యముగాను అక్రమంగాను ప్రవర్తిస్తున్నాడని చెపితే కనీసం అతని behaviour నైనా మార్చడానికి ఎటువంటి చర్య తీసుకోవడం లేదు. మా నియోజకవర్గములో మా కళ్ళముందు జరుగుతున్న విషయాలను గురించి పై అధికారులకు చెప్పినా వారు తగిన చర్య తీసుకోకపోతే మేము మా కర్తవ్యాన్ని ఏ విధంగా నిర్వహించగలం ?

మా జిల్లాలో ప్రధానమైన సమస్య శ్రోత్రియందార్లకు సంబంధించింది. చాలా గ్రామాలలో తాతలనాటినుంచి చెరువులు మరమ్మతులు లేక పాడైపోయాయి. తరతరాలుగా అనుభవించే భూములనుంచి రైతులను వెళ్ళిపొమ్మని శ్రోత్రియందార్లు నోటీసులు యిచ్చారు. రైతులు Tribunal దగ్గరకుపోయి వారి కేసులను గురించి defend చేసుకొనేందుకు శక్తి లేదు. గంగవరం, సోమవరప్పాడు మొదలైన గ్రామాలలో రైతులకు భూములమీద హక్కులు లేవని తీర్పు యిచ్చారు. ఇది చాలా అన్యాయం. శ్రోత్రియందార్లు ప్రభుత్వం తరఫున శిస్తువసూలు చెయ్యడానికి యేర్పరచబడ్డారుగాని భూములు స్వాధీనం చేసుకుని అనుభవించడానికి కాదు. ఆ భూములను రైతులు తరతరాల నుంచి అనుభవిస్తున్నట్లు, వాటిలో శ్రోత్రియందార్లకెట్టి సంబంధం లేదని విచారణచేసినందువల్ల ఋజువు కాగలదు. ప్రభుత్వం ఈ విషయంలో శ్రద్ధ తీసుకోవాలి.

**Sri P. VENKATASWAMY REDDI** :—అధ్యక్షా, ఈAppropriation Bill విషయంలో ప్రభుత్వం ప్రవేశపెట్టిన బిల్లును బలపరస్తున్నాను. ఈ సందర్భంలో నా విజ్ఞప్తి ఏమిటంటే గత బడ్జెట్ సమావేశంలో రైతాంగము 6 సంవత్సరాలనుంచి క్షామపీడితులైన కారణంచేత ఋణపీడితులై వున్న విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చి వాళ్ళ ఋణభారం తొలగించినట్లయితే కొంత అభివృద్ధి పొందడానికి వీలుంటుందని చెప్పాము. ప్రభుత్వం ఈ బడ్జెటులో దానికి సావకాశం కల్పిస్తారని అనుకున్నాము. ప్రభుత్వం దీనిని చెయ్యడానికి ఉద్దేశించినట్లు కనిపించదు. రైతుకు వుండే ఋణభారం రెండు విధాలు. రైతు రైతుకు యివ్వవలసిన ఋణాలు, రైతు ప్రభుత్వానికివ్వవలసిన ఋణాలు, రైతుకు యివ్వవలసిన ఋణాలు మారటోరియం ప్రకటిస్తే రైతుకు పరపతి పుట్టదని ఒకరు సూచించినారు. పరపతి సౌకర్యాలు వారికి ప్రభుత్వం కల్పించిన

తర్వాత మారటోరియం గురించి ఆలోచిస్తామన్నారు. అటువంటి పరపతి సౌకర్యాలు కల్పించే విషయంలో కూడా ఈ బడ్జెటులో సావకాశం కల్పించబడలేదు. ఇంకా కొంత కాలంవరకు అటువంటి సౌకర్యాలు కల్పించడం ప్రభుత్వానికి కష్టం. దానికి ఎక్కువ ద్రవ్యం అవసరం. ఆ విధంగా ఆలశ్యం అవుతుంది. కాబట్టి రైతుకు ఋణభారం తగ్గించడానికి ప్రభుత్వం గత 6 సంవత్సరాలుగా agricultural loans అనీ, తక్కావీ ఋణాలనీ, సబ్సిడీ ఋణాలనీ యిచ్చి సౌకర్యాలు కలుగజేశారు. అది ప్రతి సంవత్సరం యిస్తూనే వున్నారు. దానికి ప్రభుత్వాన్ని అభినందించాలి. ఈ సంవత్సరం పంటలు కాస్త కూస్త ఒక విధంగా బాగున్నాయన్న కారణంచేత రైతులు మంచిపరిస్థితిలోకి వచ్చారని ప్రభుత్వం భావించకూడదు. ఒక సంవత్సరం పంటలు పండినంతలోనే 6 సంవత్సరాలుగా ఋణాలతో బాధపడిన రైతులు ప్రభుత్వానికి యివ్వవలసిన బాకీలు చెల్లించే పరిస్థితులలో లేరు. రైతుకు యివ్వవలసిన బాకీలు తీర్చే విషయంలో మారటోరియం ప్రకటించడానికి ఆలశ్యం అయినప్పటికి ప్రభుత్వానికి యివ్వవలసిన ఋణాల విషయంలో అయినా 10 సంవత్సరాల దీర్ఘవాయిదాలలో వసూలుచేసుకోవడం వల్ల రైతుకు లాభం కలుగుతుంది. కాబట్టి ప్రభుత్వం అటువంటి సౌకర్యం కలుగజెయ్యాలి.

ప్రభుత్వం దేశంలో మైనర్, మేజర్ ప్రాజెక్టుల విషయంలో కొన్ని పథకాలు వేశారు. మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టుల విషయంలో జమీందారీ ప్రాంతాలలో నీటి వనరులకు సమగ్రమైన పథకాలు వెయ్యడంలేదు. జమీందారీ రైతులు అధ్వాన్న పరిస్థితులలో వున్నారు. జమీందారీ ప్రాంతాలకు preference యివ్వకుండా వుండడము విపరీతంగావుంది. వాటికి preference యిచ్చి అక్కడ రైతాంగం అభివృద్ధిలోనికి వచ్చేటందుకు ప్రభుత్వం సహాయం చెయ్యాలి, వెంకటగిరి తాలూకా జమీందారీ ప్రాంతం. అక్కడవున్న నీటి వనర్లు కోటదాకిళ్ళ కాలువ, పాముల కాలువ, వీటిని బాగుచేయించడానికి జమీందార్లుకూడా పూనుకోలేదు. 1953-54 బడ్జెటులో కూడా ఈ స్కీములను చేర్చలేదు.

ఈ సంవత్సరమైనాకూడా దీనికి కొంచెం అవకాశం యిచ్చి తగిన చర్యలను తీసుకొనవలయునని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఇప్పుడు దేశములోని వైద్యసౌకర్యాల విషయంలో ప్రభుత్వం తెలిపిన ప్రతిస్కీము కూడా పట్టణాల్లోనే ఎక్కువ వైద్యసౌకర్యాలు కల్గించేదిగా మాత్రమే ఉంటున్నది. కాని పల్లెప్రాంతాలలో ఎక్కువ వైద్యసౌకర్యములు కల్గించేదిగా కన్పించడం లేదు. గ్రామ ప్రాంతాలలో వైద్యమునకు ఒక నూతన పథకాన్ని తయారు చేస్తున్నామన్నారు. Rural Dispensaries లో Indian Medicines ను ఎక్కువగా ఉపయోగించాలని Indian Medical పద్ధతినే వైద్యంచేయాలని ఒక పథకాన్ని ప్రవేశపెట్టబోతున్నామని చెప్పారు. అయితే దీని కోసమై ప్రత్యేకంగా కొంతమంది విద్యార్థులకు Indian Medicine లో training యిస్తామని చెప్తున్నారు. Indian Medicine ను నేర్చుకోడానికి కొంతమంది విద్యార్థులు వచ్చి వారికి training పూర్తయి, ప్రాక్టీస్ పెట్టబోయే టప్పటికి దాదాపు 3 సంవత్సరము లవుతుంది. వారు training పూర్తిచేసుకొని ప్రాక్టికల్ కోర్సు పూర్తయి Rural Dispensaries కి వచ్చేటప్పటికి చాలా కాలం పడుతుంది. ఈ లోగా ప్రభుత్వం పల్లెప్రాంతాలలో Rural Dispensaries ను ఏలాంటి పరిస్థితిలో వుంచుతారో, వాటిని ఏవిధంగా నడిపిస్తారోనని నేను ప్రశ్నిస్తున్నాను. మా ప్రాంతములో వెంకటగిరిలో Head quarters Hospital ఒకటి మాత్రమే ఉన్నది. దానిని provincialise చేయుడం ఇంతవరకు జరగలేదు. 4, 5 సంవత్స

రములుగా దానిని provincialise చేయడం జరగలేదు. 4, 5 సంవత్సరములుగా దానిని provincialise చేయమని విజ్ఞప్తి చేస్తూ వస్తున్నాము. ఈ సంవత్సరమైనా వెంకటగిరి Hospital ను Provincialise చేయమని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ Hospital ఇప్పుడు సరిగా లేదు. అందువల్ల దీనిని Provincialise చేయాలని కోరుతున్నాను. తరువాత వెంకటగిరిలో Veterinary Hospital ఒకటి మాత్రమే ఉన్నది. దానిలో డాక్టర్లు ఎక్కువమంది లేరు. ఈ Veterinary Hospital ను గురించి ప్రభుత్వము తగిన శ్రద్ధ తీసుకోవడంలేదు. ఈ Veterinary Hospital లో ఒక Stationary Doctor, ఇద్దరు touring Doctor లు ఉంటున్నారు. Stationary Doctor మాత్రంతిరగడు. Touring Doctors మాత్రమే కొన్ని గ్రామాలలో తిరిగి పశువులకు జబ్బుగా ఉన్న చోటుకి తిరుగుతారు. కొన్ని కొన్ని చోట్ల touring hospitals ఉన్నాయి. అచ్చటికి పోయి ఈ touring doctors వైద్యం చేయవలసి వస్తున్నది. వెంకటగిరి Head quarters లోని Veterinary Hospital లోని Stationary Doctor తిరగడు. Stationary Doctor తిరగక touring doctors మాత్రమే తిరగడం వల్ల ఎక్కువ ప్రదేశాలకు వెళ్ళి వైద్యం చేయడానికి వీలులేక పోతోంది. అందుచేత Stationary Doctorకూడా కొన్ని కొన్ని చోట్లకుపోయి వైద్యం చేసినట్లైతే బాగుంటుంది. అలాగ కొన్నిచోట్లకు వెళ్ళి వైద్యంచేయటానికి ఏర్పాట్లు చేయాలని కోర్తున్నాను. నెల్లూరు జిల్లాలో ఇప్పుడున్న Veterinary Hospital చాలదు. ఇంకా ఎక్కువగా నెలకొల్పాలని విజ్ఞప్తి చేస్తున్నాను. రాపూరులో ప్రస్తుతం touring doctor పోయి అక్కడ వైద్యం చేయడం జరుగుతోంది. రాపూరులో ఒక Veterinary Hospital ఏర్పాటు చేస్తే బాగావుంటుందని నేను మనవిచేస్తున్నాను. తరువాత జమీందారీ ప్రాంతాలలో ప్రయాణ సౌకర్యాలు ఏమీలేవు. వెంకటగిరినుంచి రాపూరు వరకు ఉన్న రోడ్డు ఒకటి మాత్రమే ఉన్నది. అది మొత్తము 18 మైళ్ళు ఉంటుంది. ఈ 18 మైళ్ళ రోడ్డు సరిగాలేదు. దానిపై ప్రయాణం చేయడానికి చాలా కష్టంగా ఉంటున్నది. ప్రతిరోజూ రాపూరు నుంచి ప్రతి చిన్న వస్తువు కొరకు రైతాంగం, ప్రజలు అంతా వెంకటగిరి రావలసినదే. దానిని repair చేయడానికి ప్రభుత్వం గాని, జిల్లాబోర్డుగాని ఏ మాత్రము శ్రద్ధ తీసుకోవడంలేదు. ఆ రోడ్డును రిపైర్ చేయడానికి తగుచర్యలను తీసుకోవాలని నేను మనవి చేస్తున్నాను.

Sri V. CHIDANANDAM :- అధ్యక్షా ! ఇర్రిగేషన్ డిమాండ్ ఈ House లో చర్చించబడకపోవడం చాలా విచారకరము. దీనికి ప్రతిపక్షంలోనివారు, leader of the opposition ఎందుకు ఒప్పుకున్నారో నాకు తెలియదు. అయినదేదో అయిపోయింది. దానికి నేనేమీ అనడంలేదు. మా బద్వేలు తాలూకాలో సాగిలేరు ప్రాజెక్టును అమలు జరుపుతున్నందుకుగాను ప్రభుత్వానికి అభినందనలను మా ప్రాంత ప్రజలతరఫున నా తరఫున తెలియజేస్తున్నాను. ఇంకొక విషయం ఏమిటంటే, నిన్న Finance Minister గారిచ్చిన Tea-party లో నేను గవర్నర్ గారితో, ఈ ప్రాజెక్టును శాంక్షన్ చేసినందుకు నేను సంతోషిస్తున్నానని చెప్పి, నేను నా అభినందనలను వారికి తెలియజేశాను. అప్పుడు public works శాఖా మంత్రిగారు Assembly లో మంత్రులు Short notice questions కు answer యివ్వడం చాలక టీపార్టీలో గవర్నరుగారిని అడుగ వలెనా అన్నారు. వారి కది వికటంగా ఎందుకు తోచిందో అర్థంకాదు. గవర్నర్ గారితో శాసనసభ్యు లెవరూ మాట్లాడుటకు వీలులేదా ? ఇందుకు నేను నా తీవ్ర వ్యతిరేకతను తెలియజేస్తున్నాను. ఇలాంటి ముఖ్యమైన విషయాలను వారు short

notice questions చేసినా information యివ్వరు. నేను యిప్పటికి 40, 50 short notice questions పంపించాను. అందులో 1, 2 తప్ప ముఖ్యమైనవి యింత వరకు ఒకటికూడా answer చేయబడలేదు. ఈ Short notice questions answer చేయడానికి ప్రభుత్వం ఏమాత్రం జాగ్రత్త తీసుకొనడంలేదు. స్పీకర్ గారు వీటికి reminders యిచ్చి వాటికి answers తెప్పించాలని కోరుతున్నాను. సాగిలేరు ప్రాజెక్టువిషయమై బద్వేలు, సిద్దవట్టం తాలూకాలలోని యితరస్కీములు విషయమై నేను చాలా ప్రశ్నలు వేశాను. అవి ఏమయ్యాయో తెలియదు. అసలు అవి answer చేయబడతాయో, చేయబడవో తెలియదు. ప్రశ్నలు మూలకంగా తెలియకపోయినా ఈడిమాండు చర్చకు రాకపోయినా, ఈ సాగిలేరు స్కీము అమలుజరుపుతున్నారని తెలిసింది. చాలా సంతోషం. కాని ఇలాంటి విషయంలో గవర్నర్ గారివద్ద చెప్పినంతమాత్రం "గవర్నర్ గారితో చెప్పడం ఎందుకు" అని అనడం మంచిదికాదని నేను చెప్తున్నాను. సాగిలేరు ప్రాజెక్టువల్ల దాదాపు 10 వేల ఎకరాల భూమి సాగులోకి వస్తుంది. మా ప్రాంతంలో యింకా చాలా స్కీములు ఉన్నాయి. వాటి విషయమై ప్రభుత్వం ఏమాత్రం శ్రద్ధ వహించుటలేదు. సిద్ధవట్టం తాలూకాలో ఒంటిమిట్ట చెరువుకు చెయ్యేరుకు ఒక డామ్‌కట్టి సప్లైఛానల్ తెచ్చినయడల నీరు 3000 ఎకరములకు సప్లై అవుతుంది. ఆ నీరు బ్రహ్మోత్సవము జరిగినపుడు అక్కడ ఉపయోగపడుతుంది. తరువాత మిగతా రోజులలో పంటలు పండించడానికి ఉపయోగపడుతుంది. తరువాత రేకలకుంట సప్లైఛానల్, తుమ్మల వంకకు అడ్డంగా కట్టి 5, 6 చెర్వులకు నీరు సప్లైచెయ్యవలసియున్నది. బద్వేలు, సిద్ధవట్టం తాలూకాలలో చాలా చెరువులు మరమ్మతు లేకుండా ఉన్నాయి. Minor irrigation పనులు సరిగా జరగడంలేదు. ఇటుకుళ్ళపాడు చెర్వు 100 ఎకరాలకు నీరు సప్లై చేస్తుంది. దానిని ప్రభుత్వంవారు కట్టించుటకు పూనుకొనలేను. Revenue Department వారు repairs చేయుటలేదు. Minor Irrigation Department వారు repair చేయుటలేదు. ఇటుకుళ్ళపాడు క్రిందవున్న చెర్వుల ఆయకట్టు develop చెయ్యలేదు. ముజరాలు యివ్వబడుతున్నవి. అందువల్ల ఆ కొత్త చెర్వు నిర్మించుటకు వీలులేదని అభిప్రాయపడినాను. ఆయకట్టు పూర్తి సాగుతున్నదని చిన్న చెర్వులక్రింద కుష్కిపైర్లకు ముజరా యివ్వడం మామూలేనని మనవి. మహేరు ప్రాజెక్టు విషయంలో ప్రభుత్వం తగిన శ్రద్ధ తీసుకుంటుందని ఆశిస్తున్నాను.

Mr. SPEAKER:—The time is over.

Sri V. CHIDANANDAM:-I am suffering from fever. Therefore I request that I may be granted 2 minutes moie, as I am proceeding slowly.

బద్వేలు తాలూకా గానుగపెంటపాడులో 20, 30 మైళ్ళు రోడ్డులేకుండా వుంది. వర్షాకాలం ఆ పాడులో ప్రయాణమునకు చాలా కష్టంగా వుంటుంది. బండ్లపైననే తప్ప ఇంకా యితర సౌకర్యములు లేవు. ప్రజలు చాలా యిబ్బంది పడుతున్నారు. బద్వేలునుంచి నాగులపాడువరకు ఒక రోడ్డును నిర్మించవలసి యున్నది. సిద్ధేశ్వరం ప్రాజెక్టు సాగు విషయంలో ప్రభుత్వం తగిన శ్రద్ధ తీసుకున్నట్లైతే అది చాలా ఉపయోగకరంగా వుంటుంది. బద్వేలు, సిద్ధవట్టం తాలూకాలకు అది చాలా ఉపయోగపడుతుంది. వెనుకబడిన ప్రాంతాలలో చెర్వులు నిర్మించుటకు ఢిల్లీ ప్రభుత్వం యిచ్చిన మొత్తం K. C. Cannal, ను ఈ సంవత్సరములో తయారుచేసి ఆ డబ్బు దీనికి ఖర్చు పెట్టాలని ప్రయత్నం చేశారు. అది మంచిది కాదు. తరువాత, మా కడప జిల్లాలో 5

1st Class Magistrate Courts వున్నాయి. 1 నందలూరులోను, 2 కడపలోను, 2 ప్రొద్దుటూరులోను వున్నాయి. ఒక దానిని ప్రొద్దటూరునుంచి బద్వేలుకు shift చేస్తే బాగుంటుంది. Sub-Magistrate Courts వాటి సరిహద్దులలో పెట్టి, ఆ Sub-Magistrate లను కూడా Doctors వలెనే Gazetted Officers గా చేయవలయును. అట్లాచేసి, ప్రతి తాలూకాలోను కూడా ఒక Sub-Magistrate Court పెట్టినట్లైతే ప్రజలకు చాలా అందుబాటులో వుంటుంది. వారు దూరప్రయాణం చేయనవసరం వుండదు. చాలా సౌకర్యంగా వుంటుంది. అందుచేత ఆ విధంగా చేయాలని మనవి చేస్తున్నాను. తరువాత, బద్వేలులోని Hospital లో 15, 16 beds sanction చేశారు. వాటికొరకు building పూర్తి అయినది. Beds మాత్రం యింకా యివ్వలేదు. Staff ను పోస్టు చెయ్యలేదు. సిద్ధవట్టంలో వున్న Dispensary ని గవర్నమెంటు వారు తీసుకోవడానికి ఏమీ శ్రద్ధ వహించడంలేదు. తరువాత రాజేశ్వరరావు గారు మాట్లాడుతూ, గ్రామాలలో హరిజనులకు, గ్రామకరణాలు పరమవిరోధులు, హరిజనులంటే వీరికి పరమవైరుధ్యం అన్నారు. నేనుకూడా కరణంజాతికి చెందినవాడినే. నాకు బాగా తెలుసును. కాస్త ఎవరైనా హరిజనులకు అండగా వుండి వారికి సహాయం చేసేవారున్నారూ అంటే వారు కరణాలు మాత్రమే. అది తెలుసుకోకుండా వారు కరణాలపై ఈ విధంగా నిందారోపణ చేసి, యిలా అన్నందుకు నేను చాలా నిరశిస్తున్నాను. అది చాలా పొరపాటని చెప్తున్నాను. వీరు యిలా ఈ నేరాన్ని కరణాలమీద పడేయడం చాలా శోచనీయం. గ్రామ మునసబులుకూడా హరిజనులకు విరోధులు కారు. హరిజనులను కూలికి పిల్చే పెద్దపెద్ద భూస్వాములే వారికి శత్రువులు. ఎందుకంటే, హరిజనులు బాగుపడితే తర్వాత వారు పెద్ద రైతులకు కూలికిరారు. వారి పనులు జరుగవు.

L. C. E. అనే కోర్సు వున్నది. Polytechnic కు స్కూల్సులో Overseers కోర్సులు వున్నాయి. వాళ్ళకు ఉద్యోగాలు ఇవ్వడంలేదు. స్కూల్సు మాత్రం ప్రభుత్వం నడుపుతోంది. ఇవి తీసేస్తే మంచిది అని మనవిచేస్తూ, అధ్యక్షులవారు ఇంక time లేదు అంటున్నారు కాబట్టి చాలించుకుంటున్నాను.

Sri G. C. KONDAYYA :—అధ్యక్షా, 33 కోట్ల రూపాయలు ఈ సంవత్సరం ఖర్చుపెట్టడానికి వివిధశాఖలకు allot చేశారు. మొత్తంమీద House లో జరిగిన చర్చ చూస్తే, వివిధ డిపార్టుమెంటులు పనిచేసేదానిమీద జరిగిన విమర్శ చూస్తే, ఈ డబ్బును సద్వినియోగంగా ఖర్చుపెట్టడానికి, ప్రజలకు సత్ఫలితాలను అందచేయడానికి ప్రభుత్వం కృషిచేస్తుంది అని అభిప్రాయపడుతున్నాను. ఈ డబ్బు సక్రమంగా ఖర్చుకాకపోతే ఉద్దేశ్యాలు మంచివే అయినా, ఆచరణలో అప్పుడప్పుడు విఫలం కావడం, ఫలితాలు ప్రజలకు అందకపోవడం జరుగుతుంది. వివిధ డిపార్టుమెంట్లులకు ధనాన్ని allot చేసేవరకు దానిని ఖర్చుపెట్టే విషయంలో ఈ సభ ఏమి చేయలేదు. అదంతా మంత్రివర్గం చేతుల్లో వుంటుంది. ఈ సభలో ప్రతిపక్షంవారు, గవర్నమెంటు పక్షంవారు చేసిన విమర్శనను దృష్టిలోపెట్టుకొని అమలుజరపడానికి చూస్తారని అభిప్రాయపడుతున్నాను. ప్రభుత్వం నుంచి కొన్ని విషయాలపై అత్యవసరమైన సూచనలు మాత్రమే జరిగాయి. ఈనాం రైతులు విషయం చాలా ముఖ్యమైనది అని, ప్రతి గ్రామంలో ఈ సమస్య సంఘర్షణకు దారితీస్తోంది అని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. ఇది డబ్బును సంబంధించిన విషయం కాదు. ఆర్డినన్సు రూపంలోనైనా ఈనాం రైతులకు రక్షణ కల్పించడానికి ప్రయత్నించకపోతే సంఘర్షణలకు దారి తీస్తుంది అని అభిప్రాయపడుతున్నాను. బంజరు భూములు

విషయంలో ఇక్కడ discuss చేశాం. తిరిగి గ్రామాలకు పోతున్నాము. తొలకరి లోపుగా ఈ సమస్య పరిష్కారం చేయకపోతే గ్రామాలలో ఈ సమస్యకూడా సంఘర్షణకు దారితీస్తుందని మనవిచేస్తున్నాను. ఒక నిర్దుష్టమైన మార్గం చెబితే ప్రజలకు అర్థం అవుతుంది. ఆవిధంగా అనుసరిస్తారని అభిప్రాయపడుతున్నాను. వెంకటస్వామి రెడ్డిగారు మారటోరియం విషయం ప్రస్తావించారు. ఇది చాలా ముఖ్యవిషయం. మారటోరియం ప్రకటిస్తే డబ్బు దొరకకపోయినా అప్పులవాళ్ళ బాధ అయినా తప్పుతుంది. మారటోరియం ప్రకటిస్తే వున్న పరపతికూడా రైతులకు పోతుంది అని అంటున్నారు. ఇది ఒక ప్రధానమైన సమస్య. అప్పులవాళ్ళు డబ్బు కక్కాలి అంటున్నారు. ఇది చెల్లించడమే ప్రధానసమస్య అవుతుంది. ఈ విషయంలోకూడా ఒక ordinance తీసుకురావాలి. చదువుకున్న వాళ్ళలో వుండే నిరుద్యోగం, నూటికి 30 మంది వున్న వ్యవసాయ కూలీలలో నిరుద్యోగం ఈ రెండు సమస్యలమీద కేంద్రీకరించకపోవడం ప్రధానమైనలోపం. మేజరు, మైనరు ఇరిగేషను ప్రాజెక్టుల క్రింద చాలా ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టడానికి పూనుకున్నారు. నందికొండ, సిద్దేశ్వరం గురించి ఇంకా ఏమీ స్పష్టంకాలేదు. ఈ విషయంలో ఆంధ్ర ప్రభుత్వం ఒక చురుకైన కార్యక్రమం అనుసరించి five years plan లో చేర్పించగలుగుతారని ఆశిస్తున్నాను. మా జిల్లాకు సంబంధించినంతవరకు మూడు స్కీములు చేర్చినందుకు సంతోషించాలి అని అన్నారు. తప్పకుండా దానికి గవర్నమెంటు వారిని thank చేస్తున్నాను. Minor irrigation లో కొన్ని కలిపినందుకు అభినందిస్తున్నాను. ఎక్కడ కలపాలి అనేదాని కన్న ఎక్కడ అత్యవసరం అనే దృక్పథంలో ప్రవర్తిస్తే ఈపేచీలురావు అని అభిప్రాయపడుతున్నాను. 10, 15 సంవత్సరాలుగా వున్నవి వెనుకకుపోకుండా క్రొత్తవితీసుకోడానికిప్రయత్నిస్తేఅసంతృప్తిచెందరు.ముఖ్యంగా పెన్న క్రింద భూములకు కట్టలు తెగిపోతున్నాయి. వీటిగురించి అత్యవసరం అని వ్రాసినారు. ఇంతవరకు ప్రభుత్వందగ్గర pending లోనే వున్నాయి, మొత్తంమీద ప్రభుత్వ పక్ష సభ్యులు, opposition వారుచెప్పినది సమన్వయపరుచుకొని ఈ సొమ్మును పూర్తిగా ఖర్చుపెట్టి, ఆ ఖర్చువల్ల కలిగె ఫలితాలు ప్రజలకు అందేట్లు చూడాలి అని అభిప్రాయపడుతున్నాను. యూనివర్సిటీ గురించి ఒకమాట చెబుతాను. తిరుపతిలో యూనివర్సిటీ పెడతాంఅంటున్నారు. మంచిదే. రాయలసీమలోవున్న mineral Resourcesను ముందుకు తెచ్చేందుకు అవసరమైన technicians ను తయారుచేసే ఒక residential University ని ఏర్పాటుచేయవచ్చును. అంతేకాని 20, 30 సంవత్సరాలకు కాని పూర్తిగా అభివృద్ధికాని ఒక ప్రత్యేక యూనివర్సిటీని ఏర్పాటుచేసి కొన్ని జిల్లాలను తెచ్చి దానికి కలపడంవల్ల రాయలసీమకు జరిగేది ఏమిటో అర్థంకావడంలేదు. రాయలసీమ సర్కారు విభేధాలు ఎక్కువకాకుండా, రాయలసీమ mineral resources వృద్ధికిగాను ఉపయోగపడే Residential Uiversityని మాత్రమే తిరుపతిలో స్థాపించాలి అని అభిప్రాయపడుతున్నాను.

Sri R. SIDDANNA GOWD.— అధ్యక్షా, నేనుపల్లెటూరువాసిని. రైతుపాలెంలో పనిచేస్తూ వుండేవాణ్ణి. రైతుకష్టాలు నాకు బాగా తెలుసు. మన రాష్ట్రంలో రైతుబిడ్డలు అనేకమంది మంత్రులుగా వున్నప్పటికి రైతుక్షేమం ఒక అడుగైనా ముందుకు పోలేదు. మీదు మిక్కిలి రైతుకష్టాలు ఎక్కువైపోతున్నవి. మన శ్రీ తిమ్మారెడ్డిగారి వంటివారు ఆచార్య రంగాగారి అధ్వర్యాన రైతు కష్టాలు తొలగించడానికి ఆరితేరినవారు. Agriculture, Forest డిపార్టుమెంటులు వారిచేతిలో వున్నప్పటికి రైతులకష్టాలు వారుకూడా తీర్చలేకపోయారని చెప్పుటకు చాల విచారపడుచున్నాను. ఎంతమంది రైతు

బిడ్డలు ప్రభుత్వంలో వున్నప్పటికి రైతు సమస్యలు తీరలేదు. జాయింటు పట్టా భూము లకు ప్రత్యేకమైన overseers ను ఏర్పాటుచేసి వాటిని sub division చేసి రైతులు భూములపై పాలు తీసుకొనడానికి విన్నవించుకుంటే వారు అదనపు సిబ్బందిని పెట్టి survey చేయించి sub-divisions చేయించడంలేదు. గ్రామాల్లో కరణాలచేతనైనా sub.divisions చేయించడంలేదు.

కనీసము sample crop cuttings కూడా సరిగా తయారు చేయడం లేదు. తప్పుడు లెక్కలు తయారు చేయబడుచున్నవి. పంటలు తక్కువగా పండినప్పటికీ ఎక్కువగా పండినట్లు వ్రాయమని తహసీల్దారులను, R. D. O. లను కలెక్టరు ఆఫీసుకు పిలిపించి instructions యిస్తారు. గ్రామోద్యోగస్థులకు తహసీల్దారులు ఆ విధంగా చెప్పుచున్నారు. పరదేశీయులైన బ్రిటిష్ నిరంకుశవాదుల ప్రభుత్వం వుండే టప్పుడు ఈ రీతిగా చేస్తుంటే మన కాంగ్రెసు ప్రభుత్వంవారు ఎన్నో విధముల ఖండిస్తూ. వచ్చారు. అదే పద్ధతిని యీ ప్రజా ప్రభుత్వం వుండినప్పుడుకూడా అవలంభించు చున్నట్లయితే దీనిని యేమి అనవలయునో నాకు అర్థం కావడంలేదు. Forest విషయ ములో రైతుల కష్టం చూచినట్లయితే విషాదంగా వున్నది. చిత్తూరు జిల్లాలో రైతుల తరఫున Forest మంత్రిగారి వద్దకు deputation వెళ్ళినారు. ఫారెస్టులో కూపుల రూపంగా వేలంవేస్తే ఎక్కువ డబ్బు రాలేదని department వారు manage చేస్తున్నట్లు వార్తాపత్రికలలో పడినది. ఈ విషయమై Forest మంత్రిగారు యేమి చేశారో తెలియదు. ఇటు forest కూపులు save చేయబడలేదు. 8, 10 forest zones వున్నాయి. రైతులకు కావలసిన వంటచెరకు తీసుకొనిపోవడానికి అనుకూలం చేయబడలేదు. కంపభూముల విషయములో Stamp Vendors మాదిరిగా ఒక Vendor ను ఏర్పాటుచేసి వంటకు ఎంతకట్టె కావాలో ఏర్పాటుచేసి వ్యవసాయ దారులకు సదుపాయం చేయుటకు departmental గా ఏర్పాటు ఎందుకు చేయకూడదని ప్రశ్నిస్తున్నాను. ఇటువంటి సమంజసమైన నిర్మాణాత్మకమైన సూచనలు చేస్తున్నప్పటికీ కొందరు మిత్రులు నన్ను కమ్యూనిస్టు స్నేహితులకంటె ఎక్కువగా ప్రభుత్వాన్ని విమర్శిస్తున్నానని నా చర్యలను విమర్శించారు. శ్రీ నాగభూషణంగారు నన్ను ఆక్షేపించారు. నేను నిర్మాణాత్మకమైన సూచనలు చేయడంలేదని, అధ్యక్షులకు తెలుసును. సభ్యులకు తెలుసును. నేను ఎంతబాధ్యతతో నా విధులను నిర్వహిస్తున్నానో వోటు యిచ్చునపుడుకూడ నా discretion మద్రాసు అసెంబ్లీనుండీ వుపయోగించితిని. కొన్ని సమస్యలపై Party వారి mandate వున్నప్పటికీ ప్రభుత్వంతరఫుననే వోటు చేశాను. District Board ల విషయంలో పార్టీ మాండేటు వారు సంతృప్తి యివ్వని కారణంగా neutral గా వుండిపోయాను. మద్రాసు స్టేటులో Modified Elementary Education Scheme మంచిదని నేను భావించడంచేత ప్రభుత్వంవారికి మొదట వోటుచేశాను. రెండోసారి పార్టీ ఆదేశానుసారంగా neutral గా వుంటిని. నేను చెప్పిన నిర్మాణాత్మకమైన సూచనలను ఎందుకు అమలు జరపలేదని ప్రభుత్వమును ప్రశ్నించుచున్నాను. దేశంలో నూటికి 80 వంతులు రైతులున్నారు. నూటికి 80 వంతులు గ్రామములున్నవి. అందుచేత భవిష్యత్తు దృష్ట్యా వారి ప్రభుత్వపు భవిష్యతును దృష్టిలోనుంచుకొని వారి పార్టీ భవిష్యతును దృష్టిలో నుంచికొని రైతుల కష్టాలు తొలగించడానికి కృషి చెయ్యవలెనని విజ్ఞప్తి చేస్తూ విరమించుచున్నాను.

Sri K. SUBBA REDDI:—అధ్యక్షా, ఈ Appropriation Bill సందర్భములో నేను కొన్ని ముఖ్య విషయాలను ప్రభుత్వదృష్టికి తీసుకురావాలని కోరుతున్నాను.

ముఖ్యమైన Demands ను చర్చకు తీసుకురాకుండా గిలిటన్ కావడంజరిగినది. ముఖ్యంగా Forest, Irrigation, Police Demands చాల ముఖ్యమైనటు వంటివి. ముందు Forest సమస్య తీసుకుంటే. యిప్పుడు రాష్ట్రమంతటా చెట్టూ, చేమా ఒక పొదకూడా లేని cultivable lands forest అనే పేరుతో వృధాగా పడివున్నాయి. దీని విషయములో ప్రభుత్వమువారు ఎలాంటి పథకాలు తయారు చేస్తున్నారో ఎవరికీ తెలియదు. పల్నాడు తాలూకాలో 15,20 వేల ఎకరాలు భూమికలదు. దీని విషయమై పోరాటాలు సాగుతున్నవి. వాటి నాక్రమించిన వ్యవసాయ కూలీలపై కేసులు ఉపసంహరించుకుంటామని మంత్రిగారు చెప్పడం నాకు చాలా సంతోషాన్ని కలిగించింది. ఇంకా orders వెళ్ళాయో లేదో నాకు తెలియదు. అవి సక్రమంగానే జరుగుతాయని ఆశిస్తున్నాను. Plantation లేని భూముల విషయములో ప్రభుత్వం ఏ విధానం అవలంభిస్తుందో స్పష్టంగా తెలియదు.

కాబట్టి యీ భూసమస్య విషయమై వెంటనే ప్రభుత్వము ఆలోచించాలని చెప్పుతున్నాను. మా తాలూకాలో చిన్న చిన్న సమస్యలున్నాయి. హరిజనులు ఆక్రమించుకున్న భూములనుంచి వాండ్లను, 144 Section ప్రయోగించి eviction చేయించి రాజకీయబాధితులకు యిచ్చారు. కొంత హరిజనులకు, కొంత రాజకీయ బాధితులకు వుంది. ఆలాంటప్పుడు రాజకీయ బాధితులనే పేరుతో చాలమందికి పెద్ద పెద్ద భూఖండాలు యివ్వడము జరుగుతున్నది. నిజంగా దేశముకొరకు విదేశ సామ్రాజ్యవాదులతో ఢీకొని పోట్లాడినవారికి యివ్వడానికి మాకెట్టి అభ్యంతరము లేదు. కాని పెద్ద స్వాతంత్ర్య ఉద్యమములో పాల్గొన్నామనే పేరుతో భూములను సంపాదించడము దేశానికి శత్రువు లవుతున్నారు. అనేక సమస్యలున్నాయి. నాగభూషణంగారు తన ప్రసంగములో మమ్మలను Public Enemy No. 1 అన్నారు. Co-operative societies లో బ్యాంకులలో లక్షలకొలది సంపాదించినవాండ్లు Public Enemy No. 1. Black-market చేసి లక్షలు సంపాదించిన వాండ్లు public enemy No. 1. అధికారాన్ని దుర్వినియోగము చేసిన వాండ్లు public enemy No. 1, వారు వందలు, వేలు, లక్షలు జేబులు నింపుకుంటున్నారని నేను వేలెత్తి పేరుపెట్టి చూపవలసిన పనిలేదు. మనము మాట్లాడేది ఏవిధంగా మాట్లాడాలని నేను మనవిచేస్తున్నాను. Irrigation విషయములో ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలకు మేము సదుపాయము కలుగజేస్తామన్నారు. మన ప్రభుత్వము కూడా పల్నాడు తాలూకా రాయలసీమలాంటి ప్రదేశమని గుర్తించలేదు. పల్నాడు తాలూకాలో చిన్న Minor Irrigation Works ప్రారంభించలేదు. తెగిపోయిన ఒక్క చెరువుకు కూడ repair చేయించలేదు. మా తాలూకాలో దాదాపు మూడువేల ఎకరాలు 1½ లక్ష రూపాయల ఖర్చుతో సాగుచేయడానికి వీలువుంది. చిన్న చిన్న నదులున్నాయి. నందికొండ ప్రాజెక్టు పూర్తి ఔతుందని వారికి నమ్మకములేదు. ఏ ఏ పరిస్థితులు ఎట్లావుంటాయో మనము చెప్పలేము. ముందు తాత్కాలికంగా వెనుకబడిన ప్రాంతాల విషయములో యీ ప్రభుత్వముయొక్క విధానమేమిటి? వెనుకబడ్డ ప్రాంతాలు రాయలసీమ, వైజాగ్ లేనా? రాష్ట్రంలో మిగిలిన వెనుకబడిన ప్రాంతాల మాటేమిటి? యీ ప్రాంతాలలోని Minor Irrigation Projects విషయములో Government Policy ఏమిటి? ఇక పోలీసు డిమాండు వున్నది. నేనే కాదు, అనేకమంది శాసన సభ్యులు పోలీసువాండ్ల behaviour బాగుగా లేదని general గా complaints వస్తున్నాయని అంటున్నారు. పోలీసువాండ్లు కూలీలమీద, రైతులమీద తప్పుడు కేసులు పెట్టడము, information కొరకు వాండ్ల కాళ్ళు చేతులు విరగగొట్టడము జరుగుతున్నది.

ఇది తప్పుడు పద్ధతి. Illegal గా ఒక వ్యక్తిని అనేకరోజులుగా కేసు విచారణ ఏది లేకుండా రోజుల పర్యంతము sub-jail లో వుంచడము, లేకుంటే వాండ్లను గురించి స్థానికంగా వున్న పెద్దలు, చిన్నలు, తెలిసిన వాండ్లు represent చేసుకోడానికి పోతే వాండ్లను బెదరించడము జరుగుతున్నది. మాలాంటివాండ్లు వెళ్ళి జోక్యము కల్గించుకుంటే మీరెందుకు జోక్యము కల్గించుకుంటారంటారు. Police high handed behaviour ను ప్రభుత్వము అదుపులో పెట్టాలని కోరుతు విరమిస్తున్నాను.

Sri K. NAGABHUSHANAM:— Mr. C. Rajagopalachari said that the Communist Party is public enemy No.1 because it is an organised party attempting to overthrow the established Government by violent means. In that sense he said that the Communist Party is public enemy No. 1 and because there is a fundamental difference in methods. The Communists believe in violence, their creed is violence and we believe in nonviolence. If individuals are misappropriating funds or doing something else, there is the Government to look after it. But here it is an international party preaching violence and attempting to uproot the existing democracy by violent methods. In that sense Mr. C. Rajagopalachari said that Communists are public enemy No. 1.

Sri K. SUBBA REDDI :— రాజగోపాలాచారిగారి దృష్టికి కనిపించి వుండవచ్చును గాని మన ప్రజల కంటికి ఆలాగు కనపడదు. రాజగోపాలాచారి చెప్పినాడని ఇక్కడ rule వున్నదా ? కాదు.

The Hon. Sri P. THIMMA REDDI:—అధ్యక్షా యీ Forest Demand పై చర్చకు అవకాశము లేక పోయింది. మిత్రులు సిద్దనగౌడు సుబ్బారెడ్డిగార్లకు జవాబు చెప్పకపోతే వాండ్లు చెప్పిందంతా నిజమేనని ప్రపంచము భావిస్తుంది. ఈ అడవులకు సంబంధించిన సమస్య చాల చిక్కు సమస్య. నేను ఈ Forest కు సంబంధించిన వాటిని చూచి యిదివరకు కొన్ని విషయాలు మనవి చేశాను. ఈ జమీందారు Forests ను ప్రభుత్వ Reserved Forest లోనికి తీసుకున్నది. ఇదివరకు నెల్లూరు చిత్తూరు జిల్లాలలోని Estate రైతులు చాల యిబ్బందులకు గురిఅయినారు. ఈ Forest ను Reserved Forest క్రింద ఏర్పాటు చేయవలసియున్నది. ఈ Demarcation వేసేవరకు వాండ్లకు ప్రభుత్వము ప్రత్యేక సదుపాయాలు కలుగజేసింది. అయితే ప్రభుత్వము Forest ను denudation చేయడము జరుగకుండ చూడాలి. అందుచేత నెల్లూరు, చిత్తూరు, కడపజిల్లాలలో Timber Transport rules బొగ్గుకు కూడ వర్తింప చేయబడినవి. కట్టె, కంపకు గాను ప్రత్యేకంగా కొన్ని Blocks ఏర్పాటు చేయబడినవి. పశువుల మేపుకోనడానికి ఎక్కడకూడ యిబ్బంది లేకుండ ఏర్పాటు చేయడము జరిగింది. కొన్నిచోట్ల సుగాలివాండ్లు కట్టెలు కొట్టుకోనడానికి చిన్న blocks ఏర్పాటు చేయడము జరిగింది. Green manure leaves కు గాను ఎవరైతే application పెట్టుకుంటారో వాండ్లందరకు యిస్తున్నాము. ఒక జిల్లాలో ఏలాంటి రుసుము లేకుండ యిస్తున్నాము. చెట్లు పెట్టినచోట పెరికి వేస్తున్నారు. ఇలాంటి వారిని ఎవిక్షన్ చేయించ వలసి వస్తుంది. అగ్రిమెంట్

ప్రకారం ఒప్పుకోవాలి. కేసులు పెట్టుతున్నామన్నారు. పెట్టిన కేసులు సక్రమమైనవే. అయినాకొన్ని చోట్ల withdraw చేశాం. గవర్నమెంట్ ఉద్యోగస్థులను కొన్నిచోట్ల కొట్టారు. ఉద్యోగస్థుల మీద అక్రమాలు జరిగినచోట case లను withdraw చేయడానికి వీలులేదు. అడవులలో కట్టెలు కొట్టడానికి కొన్నిచోట్ల అభ్యంతరాలు పెట్టాం. ఎందుకట్టెలనే నెపముతో పచ్చివాటిని నరుకుతున్నారు. ఇందువల్ల కొద్ది కాలములో అడవులు నాశనమై పోతాయని మా అభ్యంతరం. వర్షాలు కురిసి పంటలు పండాలంటే అడవులు వుండటం చాలా అవుసరం. పశుగ్రాసం పొయ్యిలో పుల్లలు, పచ్చాకు ఎరువు వీట్లవిషయంలో శ్రద్ధచూపుతాం. శిద్దన్నగౌడుగారు చెప్పిన సలహాలను, అంగీకరిస్తాం. Forest Department అనేది ఒకటి వున్నదనీ, ప్రతి విషయం ఆలోచిస్తుందనీ గమనించ గోరుతాము. సాగుకు లాయకీ అయిన అడవివుంటే దాని విషయం గూడ ఆలోచిస్తాం. దీనిని గురించి డిపార్టుమెంట్ వారు పూర్తి అయిన శ్రద్ధ తీసుకుంటారని మీకు మనవి చేస్తున్నాను. పిటీషనులు పెట్టేటప్పుడు మాత్రం అవి కొంచెం క్రమంగాను, న్యాయంగాను ధర్మంగాను వుండేటట్లుగా చూడమనికోరుతున్నాను.

Sri T. NAGI REDDI:—ఇన్నిరోజుల Budget చర్చల తరువాత గవర్నమెంటు యీ డబ్బు వినియోగించటానికి అధికారం యిస్తూ యీ దినం appropriation bill pass చేయవలసిన కడపటి దశలో మనం వున్నాం. ఈ సంవత్సరములో appropriate చేయడానికి ప్రభుత్వానికి యిస్తున్న డబ్బు ఏ విధంగా ఖర్చుపెట్టబడుతున్నదీ అనే విషయం, ఎప్పటికప్పుడు అసెంబ్లీకి తెలియడానికి వీలుగా వుండేటట్లుగా ఒక పద్ధతిని, అవలంభించడం చాలా అవుసరం అని అంటూ శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య, శ్రీ కె. కృష్ణారావుగార్లు చెప్పారు. కొన్ని దేశాలలోను, సెంట్రల్ గవర్నమెంట్ లోగూడ, అసెంబ్లీ యిచ్చినటువంటి ఆదేశాన్ని సక్రమంగా ప్రభుత్వం నిర్వహిస్తున్నదా, లేదా అని తెలుసుకొని, దానిని అదుపులో పెట్టడానికి వీళ్ళు వున్నవి. ఇందువల్ల ప్రభుత్వం మీద అజమాయిషీ వుంటుంది. ఇది లేనప్పుడు ప్రభుత్వం వారి యిష్టము వచ్చినట్లుగా, నిరంకుశత్వంగా పాలించటానికి అవకాశం యిచ్చినట్లుగా వుంటుంది. కాబట్టి ఎస్టిమేట్ కమిటీ ఒకటివుండాలని సభ్యులు వాంఛిస్తున్నారనే విషయం శ్రీ విశ్వనాథంగారికి, ప్రభుత్వమునకు తెలుసును. ఇటువంటి కమిటీ ఏర్పాటు చేయటానికి, ప్రభుత్వం పూనుకొనవలసి వున్నదని నేను ఆశిస్తున్నాను. ప్రతిసారి Budget జరిగినప్పుడు budget చర్చలలో పాల్గొనాలంటే, సభ్యులను కొన్ని కష్టాలు ఎదుర్కొంటున్నాయి. ముఖ్యంగా కావలసిన సమాచారం లభించకపోవటం. మద్రాసు శాసన సభలో చూస్తే ఆ సంవత్సరం రిపోర్టులు, రెండు-మూడు సంవత్సరాల తరువాత మన చేతిలోనికి వచ్చేవి. డిపార్టుమెంట్లను గురించి, ఏ సంవత్సరానికి ఆ సంవత్సరము ప్రభుత్వము చేతులలో పెట్టితే నేతప్ప ప్రభుత్వం చేస్తున్న కార్యక్రమం గురించి చర్చించడానికి అవకాశం వుండదని, మీకు తెలుసును. బ్రిటిష్ గవర్నమెంట్ వుండేరోజుల్లో యిది జరుగుతూ వుండేది. కాని, 4 సంవత్సరాల కొకసారి administration రిపోర్టులు యిస్తూ వుంటే, అది ఏ మాత్రం ఉపయోగం లేకుండా వుంది. Education గురించి చర్చించాలంటే, చర్చించేముందు, క్రిందటి సంవత్సరంలో మనం సాధించింది ఏమిటి? ఇంకా ఏమి సాధించాలి? అని తెలుసుకోవలెనంటే, వెనుకటి రిపోర్టులు దొరకవు. మా చర్చలు గాలిలో చర్చించినట్లుగా వుంటున్నవి. వాస్తవిక పరిస్థితులకు అనుగుణంగా లేవని, మేము బాధపడుచున్నాము. హరిజన్ వెల్ఫేర్‌ను గురించి ఏమీ చేస్తున్నా

రని, వెనుకకు తిరిగి చూస్తే పెద్ద మొత్తములు ఖర్చులు పెట్టుతున్నట్టు వుంటుంది గాని, వాటి పూర్తి వివరాలు వుండవు. వాటికి సంబంధించిన రిపోర్టులు వుండవు. ఆంధ్ర ప్రభుత్వంవారు త్వరగా యీ రిపోర్టులను అందజేసే ఏర్పాట్లను అవలంభిస్తారని ఆశించుచున్నాను. ప్రతి డిపార్టుమెంటుక్రింద, ఎంత ఖర్చు అవుతున్నది ? దానిమీద వచ్చే ఆదాయం ఎంత ? అనే విషయాలను గురించి సంపూర్ణంగా రిపోర్టు మాకు యివ్వ లేనప్పుడు కనీసము అందాజ్ గానైనా యీ వివరాలను సభ్యులకు అందచేయటం చాలా అవుసరం. అటువంటివి పెట్టకపోతే ప్రభుత్వ కార్యక్రమము ఏ విధంగా జరిపించిందీ సభ్యులకు ఏమీ తెలియదు. ఈ సంవత్సరం కొన్ని కోట్ల రూపాయలు శాంక్షన్ చేస్తున్నాం. ఏవో కొన్ని బ్రిడ్జీలు కట్టడానికి ప్రాజక్టులు కట్టడానికి అని చెబుతూ, తదితర విషయాలను గురించి, శాసన సభ్యులకు, శాసనసభకు తెలియనపుడు, ప్రభుత్వానికి గూడ తెలియదని అనుకొంటున్నాను. ప్రభుత్వానికి తెలియనప్పుడు, యీ Budget ఎందుకు ? ఇది చర్చించటం ఎందుకు ? అనే ఒక సమస్యగూడ మనముందు వుంది. అంత మాత్రమైనను Budget సమయానికి రిపోర్టులను అచ్చుగొట్టించి సభ్యులకు యివ్వ లేకపోయిననూ కనీసం ఒక్కొక్క డిపార్టుమెంట్ గురించి మూడు పేజీలలోనైనా పూర్తి వివరములను సభ్యులముందు పెట్టడం చాలా అవుసరం. ఈ విధంగా ప్రభుత్వం ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తుందని భావిస్తున్నాను. బడ్జెట్ లో నున్న యీ అంకెలవల్ల ఏ ఏ డిపార్టుమెంటుకు ఎంతెంత ఖర్చు అవుతున్నదీ తెలియదు. ఈ డిపార్టు మెంటులలో లోతుగా వెళ్ళుదామంటే ఏమీ దొరకదు. కంటిన్ జెన్సీస్ సంఖ్య చాలా వేలమీద వుంటుంది. దీనినిగురించి పూర్తి వివరాలు తెలపటం అవుసరం. ఇతర విషయా లలో గూడ జాగ్రత్తగా సభ్యులకు ఉపయోగపడేటట్లుగా Budget ను తయారు చేయాలిగాని, అంకెలను గారడీగా చేయగూడదు.

ఇప్పుడు ఈ బడ్జెటునుచూచి రానున్నటువంటి సంవత్సరంలో మనము సాధించ బోయే దేనిటి అనేదాన్ని గురించి జాగ్రత్తగా ఆలోచించినట్లైతే, నా మటుకు నాకు రానున్న సంవత్సరం మనం సాధించబోయే దేమిటో చెప్పడానికి వీలులేదు. ఆ ప్రాజెక్టు కడుతాము, ఈ ప్రాజెక్టు కడుతాము అని చెప్పుకోవడం తప్పితే, ఏదికడతామో ఏది లేదో తెలియదు. మొత్తం చేయదలుచుకున్నటువంటి కార్యక్రమం ఏమిటీ ? Education department లో గాని, Health department లో గాని Medical department లో గాని, ఎక్కువగా వేసినటువంటి ఖర్చులు ఏమి, ఎంత ఖర్చుచేస్తున్నాము, మనము అసలు administration కు గాను ఎంత ఖర్చుచేస్తున్నాము, డాక్టర్లకు నర్సులకు ఎంత ఖర్చుచేస్తున్నాము, దాని ద్వారా మొత్తంమీద దేశానికి ఈ సంవత్సరం జరుగుతున్న అభివృద్ధిని సూచించేటటువంటి సంఖ్యలు ఏవైనా ఉన్నవా అని చూస్తే, అవి ఏవీగూడా ఈ బడ్జెటులో కన్పించవు. Budget Memorandam లో ఆ details ఇస్తారా అంటే లేదు. కాబట్టి ఈ విధమైనటువంటి budgetary విధానము ప్రజలకు budget కు సంబంధం లేకుండా దూరంచేసే విధానమే గాని, ప్రజలకు, బడ్జెటుకు సన్నిహితంగా తీసుకువచ్చేటటువంటి విధానం కాదు అని నా అభిప్రాయం. ఇక ముందైనా అటువంటి విధానాన్ని అనుసరించాలని కోరుతున్నాను.

ఇక పోతే, మద్రాసురాష్ట్రములో మనము విడిపోవడానికి ముందు ప్రభుత్వము ప్రజలదగ్గరనుంచి అప్పు తీసుకున్నది. ఆ అప్పు తీసుకొన్నప్పుడు ప్రభుత్వము ప్రజలకు ఒక వాగ్దానం చేసింది. ఏ యే జిల్లాలలో అప్పులు తీసుకొన్నారో, ఆయా జిల్లాలలో ప్రజలకు అవసరమైన కొన్ని constructive కార్యాలకు ఆ ద్రవ్యాన్ని ఉపయో

గిస్తామని ప్రభుత్వం చెప్పింది. అప్పులు తీసుకొన్నాము గదా ఆ అప్పులు మొత్తం ఖర్చు చేసినామా లేదా, ఏవిధంగా ఖర్చు చేసినాము అని ప్రజలకు తెలియడానికి కనీసము ఒక రిపోర్టయినా ఈసభముందు పెట్టవలసిన అవసరం లేదా అని అడుగుచున్నాను. ఆ అప్పులు ఏమైనాయో, ఏమి చేసినారో తెలియకుండా ఉన్నది. ఏ యే జిల్లాలో ఎంత వసూలు అయింది, దాన్ని ఏవిధంగా ఖర్చుచేసింది అనే వివరాలు ప్రభుత్వము తెలియజేయక పోవడం జరిగింది. అంటే, రేపు ప్రొద్దున మరల ప్రజలదగ్గర అప్పు అడగవలసివచ్చినప్పుడు ముందు మీరు అప్పుతీసుకొని ప్రజావసరాలకు వినియోగిస్తామని చెప్పారు కాని, ఏవిధంగా ఏమిటికి ఉపయోగించారో తెలియదు, తిరిగి ఈ దినము మీరు అప్పు అడుగుచున్నారు ఎందుకు ఇవ్వాలి అని ప్రజలు అడగడానికి అవకాశమున్నది. కనుక ప్రజలు యిచ్చినఅప్పును ఏవిధంగా ఖర్చుపెట్టబడింది, ఏయే జిల్లాలో ఎంత ఖర్చుపెట్టబడింది, ఎంత మిగిలింది అనే సమాచారం ప్రభుత్వము ఇవ్వవలసినటువంటి అవసరం ఉన్నది. ఈ సమాచారము ఇవ్వక పోయినట్లైతే మనం మన బాధ్యతలను సక్రమంగా నిర్వహించినట్లుకాదు అని భావిస్తున్నాను. మొత్తంమీద మన బడ్జెటులో ప్రభుత్వ యంత్రాంగానికి చాలా ఖర్చు పెడుతున్నారు. దానిని ఏవిధంగా నైనా తగ్గించి ప్రజల అభివృద్ధి కార్యక్రమాలకు ఉపయోగించవలసిన అవసరమున్నది. ఈ administration విధానం గురించి ప్రకాశం పంతులుగారు మాట్లాడుతూ అమెరికానుంచి ఒక expert ను పిలిపించి ఈ విషయాన్ని విచారించటానికి ప్రయత్నం చేస్తారని విన్నాను. అది పత్రికలలో కూడ పడింది. కనుక అది నిజమే అనుకుంటాను.

ఇక ఈ సందర్భంలో జపానుకు వెళ్ళి, అక్కడ ఉన్న పరిస్థితులను చూచివచ్చి, మన దేశంలో అటువంటి విధానాలను అమలుపరుచుటకును, అటువంటి పరిస్థితులు మన దేశంలో రావడానికిని వీలున్నదా అని తెలుసుకోవడానికి జపానుకు వెళ్ళుతున్నారు అనే విషయం కూడా పత్రికలలో వచ్చింది. ఈ సందర్భంలో పంతులుగారికి నేను ఒక విషయాన్ని చెప్పాలని అనుకొంటున్నాను. ఇక్కడ centralised administration అవసరమని చెప్పుతూ, పంచాయితీ బోర్డులకు ఎక్కువ అధికారాలు ఇస్తేతప్ప మనదేశంలో ఈ పరిపాలన సక్రమంగా నిర్వహించలేమని పంతులుగారు చాలాసార్లు ప్రజలముందు పెట్టారు. మన అసెంబ్లీలో కూడా చెప్పారు. తరువాత మనం చట్టాలు చేస్తూయుంటే ఆ చట్టాలను ఆచరణలో వుండడంలేదు అనే విషయాన్ని చర్చించినప్పుడు, ఈచట్టాలను ఆచరణలో ఎట్లాగా పెట్టడం అనే విషయంలో మీరు సలహా ఇవ్వగలరా అని పంతులుగారు ఒక ప్రశ్నకూడావేశారు. దీనికే భారత జాతీయోద్యమం ఒక సమాధానం ఇచ్చిందని నా అభిప్రాయం. ఆసమాధానం ఆనాడు జాతీయ నాయకుడుగా పనిచేస్తూ, జాతీయ ప్రజలందరిని ఉత్సాహంతో నడుపుతున్న జవహర్లాల్ నెహ్రూగారు ఇచ్చారని నా అభిప్రాయం. ఆనాడు ఇచ్చినటువంటిదాన్ని ఉపయోగపెట్టలేక, ఇతర దేశాలకు పోవాలని చెప్పుతున్నారు. ఏ చట్టమైనా సరే ప్రజలకు ఉపయోగపడే చట్టాలు సక్రమంగా అమలుజరగాలంటే, అవి పైనుంచి రుద్దితేకాదు. అయితే అవి ఎట్లాగా ఆచరణలోకి వస్తుంది? దానికికూడ ఆయన ఈ విధంగా చెప్పాడు :—

"A change in the land laws will bring some relief to our peasantry, but our objective is much bigger one, and for that, the pre-requisite is the development of the organized strength of the peasantry. Only by their own strength can they ultimately progress or resist the inroads that vested interests might risk on them

A boon given from above to a weak pesantry may be taken away later, and even a good law may have little value because it cannot be enforced.

అని ఆయన చెప్పారు. కనుక చట్టము మంచిదే కావచ్చు కాని దానిని అమలుపెట్టడములో ప్రజానీకానికి "ఇది నా హక్కు, ఈ హక్కును రక్షించడానికే ఈ చట్టము ఏర్పడింది. దీనిని అనుసరించడంలో ప్రభుత్వము నాకు అండగా ఉండ గలదు" అనే ధైర్యము ప్రభుత్వము ఇవ్వాలి అన్నట్లైన ప్రజానీకాన్ని organise చేసి వారికి ఉత్సాహాన్ని, శక్తిని, ధైర్యాన్ని ఇచ్చి ముందకు తీసుకురావలసిన అవసర మున్నది. లేకపోయినట్లైతే, మన చట్టాలన్నీ ఆకాశంలోని మేడలులాగే నిలిచిపోతాయనే విష యాన్ని గుర్తించ వలసిందని కోరుతున్నాను. మనము కొన్ని కొన్ని చట్టాలు తీసు కొందాము. వెట్టిచాకిరీ కూడదు అనే చట్టము చేసినామనుకొందాము. ఆ చట్టాన్ని చేసి అచ్చుకొట్టించినంత మాత్రాన దేశమంతా ఈ వెట్టిచాకిరీ అనేది పోతుందా? కారణం ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా అభివృద్ధి చెందినటువంటి కొందరు వ్యక్తులు ఈ చట్టాన్ని పెట్టనివ్వకుండా చేయడమే. ఇందుకు వారికిగల ఆర్థికబలం, రాజకీయంగా వాళ్ళకు ప్రభుత్వము మీద ఉన్నటువంటి బలం, వారికి సాంఘికంగా ఉన్నటువంటి కలుకుబడి, ఇవే కారణమని చెప్పుతున్నాను. అటువంటప్పుడు దీనిని ఆచరణలో పెట్టించ డం ఏలాగు అని అడిగినట్లైతే ప్రజలకు ఈ విషయాన్ని చెప్పి, ప్రజలందరిని organise చేసి, ఇదిగో ఈ హక్కు మీకున్నది. దీన్ని మీరు ఉపయోగించుకొండి. దీన్ని అనుస రించడంలో ప్రభుత్వము మీ అండగా ఉంటుంది అనిచెప్పి వారిని ఆవిధంగా నడిపిస్తే తప్ప ఈ చట్టాలు చట్టాలుగానే ఉండిపోతాయేగాని వీటివల్ల మరేమి ప్రయోజనం ఉండ దని చెప్పుచున్నాను. ఆ విధంగా ప్రజానీకాన్ని organise చేస్తేనే చట్టాలు ఆచరణ లోకి రాగలవు. అదే నిజమైన ప్రజాస్వామికము. అదే సరియైన రాష్ట్రము. అటువంటి రాష్ట్రాన్ని నెలకొల్పడానికి ఈ దినము ప్రజలను సంసిద్ధం చేయాలి. కనుక ఈనాడు ప్రధానంగా చేయవలసినటువంటిది development of the organised strength of the people. దాన్ని మనం develop చేయాలి. అది చేస్తే తప్ప, వీటిని ఆచరణలో పెట్టించలేము. అది develop చేయలేక పోయినట్లైతే, ఎన్ని చట్టాలు చేసినా, vested interests అనేవి అడ్డు తగులుతూ ఉంటాయి. వీటికీనాడు బలమున్నది. ఈ సంగతి ప్రభుత్వమునకు తెలుసు. కాని ప్రభుత్వము దీనిని అరికట్ట డానికి ఏమిచర్య తీసుకొంటున్నదో జాగ్రత్తగా ఆలోచించవలసిందని మిమ్మలను కోరుతున్నాను. ఇదిమనకు చాలా అవసరం. జవహర్లాల్ నెహ్రూ 1937 లో ఆగష్టు 10 తేదీన దీన్నిగురించి చెప్పారు. ఈ విధంగా చెయ్యకపోతే కాంగ్రెసు ప్రభుత్వాలు అధికారములో ఉన్నరోజులలో సక్రమమైన కార్యక్రమాన్ని నిర్వహించ లేకపోతాయని చెప్పారు. కనుక కాంగ్రెస్ ప్రభుత్వాలు ఎంతకాలమైతే ఈ విధ మైనటువంటి కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టవో అంతవరకు సామాన్య ప్రజానీకము తగువిధంగా సహాయపడలేదు. అని రుజువుచేస్తాము.

మన దేశములో ప్రజలు ఉత్సాహముతో ముందుకు రాలేకపోతున్నారనే విష యము అందరు చూస్తున్నారు. అయితే China దేశములో ప్రజలు ముందుకు వస్తున్నా రని ఆ దేశమునకు వెళ్ళిన జాతీయవాది చెబుతున్నారు. మనదేశపు రాయబారి ఫణిక్కర్ గారు అక్కడి ప్రజలను గురించి చెబుతున్నారు. అదే విధంగా మన ప్రజలనుగూడా

ముందుకు తీసుకురావలసిన బాధ్యత మన ప్రభుత్వముమీద లేదా ? చైనాదేశములోని ప్రజలు ముందుకు వస్తున్న కారణము అక్కడవున్న ప్రభుత్వము, ప్రజలు, పార్టీలు, ప్రజలకొరకు ప్రభుత్వముచేసే చట్టాలు, వీటిఫలితముగా ప్రజలు క్రమంగా వారియొక్క హక్కులను నిర్వహించుకోటానికి ఉపయోగపడేటట్లుగా ప్రజలు కట్టుదిట్టముగా collectcive strength ను organise చేసుకున్నారు. ప్రభుత్వముచేసిన చట్టాల వల్లనైతే నేమి, ప్రజలు చేసుకున్న organisations వల్ల నైతే నేమి ప్రజలు ఎంతో relief feel అవుతున్నారు. అదేవిధముగా యిక్కడ మనదేశములో ప్రజలు తమ హక్కులు నిలబెట్టుకోటానికి collective stength కూడగట్టుకొని organise చేసుకోటానికి కృషిచేయనివ్వాలి. ప్రజలు నాది హక్కు అని అనుకోటానికి విలులేని పరిస్థితులు మనదేశములో వున్నవి. ప్రజలకు స్వాతంత్ర్యహక్కును సంపాదించుకోటానికి నాది హక్కు అనేది నిర్వహించి నిలబెట్టుకోటానికిని ప్రభుత్వము దోహదమివ్వాలి. ప్రకాశం పంతులుగారు ఆ దేశాలకు వెళ్ళినప్పుడు యీ విషయము లన్నియు జాగ్రత్తగా పరిశీలించమని కోరుతున్నాను. పంతులుగారు జపాను ప్రయాణము తలపెట్టినప్పుడు అక్కడ ప్రక్కనే వున్న చైనాదేశముకూడా చూచి, అక్కడి పరిస్థితులుకూడా గమనించి వస్తారని ఆశిస్తున్నాను.

The Hon. Sri T. PRAKASAM :— చైనా అనుకున్నంత దగ్గరలో వుందా ?

Sri T. NAGI REDDI :— ఆ. చాలా దగ్గరగా వున్నది. రెండు నిమిషాలలో పోవచ్చు. అక్కడ పరిస్థితులు ఏవిధంగా వున్నవో గమనించాలని పంతులుగారికి విజ్ఞప్తి చేస్తున్నాను. మన దేశంలో ప్రజల పరిస్థితులు, అక్కడ పరిస్థితులు తేడా గమనించాలని వారిని నేను ముఖ్యంగా కోరుతున్నాను. అక్కడ ప్రజలు ఏ విధంగా strength ను ఆర్గనైజు చేసుకోగలిగిందిన్నీ దీనికి ప్రధానకార్ణము ఏమిటి అనే విషయమున్నూ, అన్ని సంగతులుగూడా పరిశీలించివస్తారా అని అడుగుతున్నాను. ఇంకను వారు నన్నుగూడా పిలుచుకొనిపోతే నేను వారివెంబడి వెళ్ళాలని ఆశగా వున్నది. వారి ప్రక్కనే వుండి అక్కడి దేశపు పరిస్థితులు నేనుకూడా చూచిరావటానికి ఆశగా వుంది. అయితే నేను ప్రక్కన వున్నప్పుడు ఏదైనా వారి చెవిలో చెబుతానేమో నన్న అనుమానము వారికి వుండవచ్చుననుకుంటాను. ఇప్పుడు వారు విదేశాలకు పోతున్నప్పుడు నేను వారిని ముఖ్యంగా కోరుతున్నదేమిటంటే, మనకు యిక్కడ పరిస్థితులు యేమిటి ? అక్కడ దేశములో పరిస్థితులు ఎట్లావున్నవి ? అక్కడి ప్రజలు ఏవిధంగా ముందుకు రాగలుగుతున్నారు ? అక్కడి ప్రభుత్వ పరిపాలన ఎట్లావుంది ? అక్కడి ప్రభుత్వం పరిపాలనకుగాను ఖర్చుచేస్తున్న సొమ్ము ప్రజలకు ఏవిధంగా ఉపయోగపడుతున్నది ? మనది యిక్కడ పూర్తిగా వ్యవసాయదేశము. నూతన పద్ధతులతో మనకు యిక్కడ వ్యవసాయము ముందుకు ఏవిధంగా తీసుకొనిరాగలము, యివన్ని పంతులుగారు పరిశీలించి వస్తారని ఆశిస్తున్నాను. వారు అక్కడి పరిస్థితులు పరిశీలించివచ్చిన తరువాత మనకు గూడా ప్రభుత్వ పరిపాలనలో మార్పుతెస్తే బాగుంటుందని అంటున్నాను.

The Hon. Sri T. PRAKASAM :—శ్రీ నాగిరెడ్డిగారు పొరపాటు పడుతున్నారు. వారి మనస్సులోను, యితరుల మనస్సులలోనూ ఏమి వున్నదో నాకు బాగా తెలుస్తునేయున్నది. ఇప్పుడు American expert ను గురించి వారు మాట్లాడుతున్నారు. అమెరికా నుంచి expert ను తీసుకొని రావాలని మేము ఎవ్వరము అనుకోవడములేదు. మన దేశపు వ్యవసాయము విషయములో అమెరికానుంచి

వచ్చే expert వల్ల మనదేశంలోని వ్యవసాయం నిర్వహించటానికి వారి suggestions తో ప్రారంభించుదామని మేము అనుకోనేలేదు. ఆయన suggestions మన దేశానికి పనికిరావు అని అనుకున్నాను.

Sri T. NAGI REDDI :—మంచి అనుభవముగల expert ను తీసుకొనివస్తే మంచిదే. నాకేమి అభ్యంతరములేదు. ఇక్కడ మన దేశంలోనే ఎంతోమంది వ్యవసాయ నిపుణులవల్ల కాదగు పనులను ముందు ఆచరణలో పెట్టటానికి ప్రభుత్వం ప్రయత్నించేస్తే బాగుంటుందని నాఅభిప్రాయము. ఆతరువాత యితరుల సహాయము కోరవచ్చును. పంతులుగారు నా suggestion త్రోసివేయరని అనుకొంటున్నాను. నేను కొత్తగా ఏమి చెప్ప దలచుకోలేదు. వీరికి ఒక చిన్న సామాన్యమైన సలహా యివ్వదలచుకున్నాను. అది వారు పాటిస్తారని ఆశిస్తున్నాను. ఆ దేశానికి వెళ్ళినప్పుడు అక్కడ ప్రభుత్వంవారు అమలులో పెట్టిన incidence of taxation ప్రజలమీద ఏవిధంగా పడుతున్నది, అది తెలుసుకోవడం కష్టమే అయినప్పటికిన్ని, సాధ్యమైనంతవరకు, చేతనైనంతవరకు గమనించగోరుతున్నాను. ఈనాడు యిక్కడవున్న రాష్ట్ర గవర్నమెంటు, సెంట్రల్ గవర్నమెంటు సరిహద్దులలో వున్న విషయాలకు మధ్య పన్నులు ఏ ఏ రకమైనవి ప్రజల మీద పడుతున్నవి అనే విషయము, దాని వివరాలు సేకరించి మీముందు పెట్టవలసిన అవసరము వున్నదని నేను భావిస్తున్నాను. గుడ్డివానికి లాంతరు చూపినట్లుగా, ప్రభుత్వము వారు వేసేపన్నులు అన్నియు గుడ్డితనముగా కట్టడము జరుగుచున్నది. అదేవిధంగా గుడ్డివాడుపోయే పద్ధతిలో పోయే బదులు యీ విషయము జాగ్రత్తగా పరిశీలించి చేయవలసిన పద్ధతి కొబట్టి, దీని విషయములో వివరాలు సేకరించవలసిన అవసరము వున్నదని నేను భావిస్తున్నాను. బహుశ చిదానందంగారు కాబోలు Irrigation Dmand మీద రావలసిన చర్చ జరగలేదు. Leader of the Opposition దానిమీద చర్చ జరగకుండా ఎట్లా ప్యాసుచేయటానికి ఒప్పుకుంటున్నారని, వారు మాట్లాడారు. నిజమే నేను opposition తరపున ప్రభుత్వానికి ఒక విజ్ఞప్తి చేశాను. ఈ సమావేశములో చర్చలు తక్కువ కాలములో ముగిసిపోతున్నాయని నేను అన్నాను. 5 వ తేదీన ప్రారంభించ టానికి బదులు ఆలశ్యముగా బడ్జటు ప్రారంభించడము జరిగింది. తరువాత general discussion రెండు వారాలు అయినను చర్చలు జరపాలని కోరాను. అంత తక్కువగా అయితే బడ్జటును సాగించటానికి వీలులేదని విజ్ఞప్తిచేశాను. ప్రభుత్వము నామాట పాటించ లేదు. అందువల్ల ఆనాడునంచే బడ్జటు discussion తీసుకొంటే, తరువాత voting on demand తొమ్మిది రోజులు అయినా లేదని అనుకొన్నాను. అందువల్ల యీబడ్జటు యీ విధంగా ముగింపుచేయబడ్డది. ఈసారి బడ్జటు సమావేశము పూర్తిఅయినప్పటికిని, యికముందు రాబోయే బడ్జటు అయినను తొందరబడి, ఏదో వారిచేతులలో majority వున్నదనే ధైర్యముతో వున్నప్పటికిని ఒక విధంగా road roller గా చేసుకొనే పద్ధతిని కొకుండా, ప్రభుత్వము ఒక సక్రమమైన పద్ధతిని అవలంభించాలని, నేను కోరుతున్నాను.

మరొక విషయం. నేడు గుంటూరు టౌను మునిసిపల్ వర్కర్లు సమ్మె చేయడము జరుగుచున్నది. ఈ సమ్మెజరిపే సందర్భములో అది వర్కర్ల తప్పుకాదని, అక్కడ జిల్లా అధికారులైన ఉద్యోగస్థులే చెబుతున్నారు. తరువాత మునిసిపల్ authorities కు కలెక్టరు చెప్పినా వినలేదు. ఇంకా యితర వుద్యోగస్థులు, మేముకూడా చెప్పాము. విన లేదు. వర్కర్లును పనిలో చేర్చుకోలేదు. పనిలో చేర్చుకోనందువల్ల సమ్మె మరింత

తీవ్రంగా సాగుతున్నది. ప్రభుత్వోద్యోగులు కార్మికులను రెచ్చగొట్టే విధంగా చేయు వద్దని, నేను గతసమావేశములోనే చెప్పాను.

ప్రభుత్వము నా యొక్క సూచనను పాటించక నిర్లక్ష్యముచేసిన కారణంగా యిప్పుడు యీ సమ్మె మరింత తీవ్రతరమై, పరిస్థితులు చెడిపోయినవి. ప్రభుత్వము యీ పరిస్థితులను ఎదుర్కొనవలసివచ్చింది. ప్రభుత్వము పరిష్కార మార్గమునకు నిర్లక్ష్యము చేయడమే కాకుండా కమ్యూనిస్టులు కార్మికులను encourage చేస్తున్నారనే దుష్ప్రచారము ఆరంభిస్తున్నారు. ఎందువల్ల యీ సమ్మెలు జరుగుతున్నవనేది దీనికి కారకులు ఎవరు అనేది మన ఉప ముఖ్యమంత్రిగారి వుపన్యాసములోనే తెలుస్తున్నది. కమ్యూనిస్టుపార్టీ యిటువంటి కార్యక్రమము చేసిందని చెప్పడం తప్ప, బహిరంగముగా చేసినవారు ఎవరో ప్రభుత్వానికి తెలియదా? Labour Officer, కలెక్టరు వచ్చి చెప్పిన తరువాతనైనా, ఒప్పుకొని కార్మికులను పనిలో చేర్చుకోకపోవడము ఎవరితప్పో ఆలోచించమంటున్నాను. కార్మికులదే తప్పు అయితే కలెక్టరు, లేబరు ఆఫీసరు, ఇంకను యితర ఉద్యోగస్థులు వచ్చి ఎందుకు చెబుతారు? కార్మికులకు యే విధమైన grievance వుంటున్నదో ప్రభుత్వము ఎందుకు విచారించి, పరిష్కారము చేయగూడదు? ఇంతవరకు ఎందుకు నిర్లక్ష్యము చేయాలి? ఎంతమంది అధికార్లు వచ్చి చెప్పినాకూడా వాళ్ళను పనిలో చేర్చుకోక పోవడమువల్లగదా, యీ సమ్మె చేయడంజరిగింది? వృథాగా కమ్యూనిస్టులు, కమ్యూనిస్టులు అని దుష్ప్రచారము చేస్తే ప్రయోజనము యేమి? ప్రపంచానికి కళ్ళులేవని అంటారా? ప్రజలు గుర్తించలేరా? ఈ విధంగా ప్రజలకు కొద్దోగొప్పో ప్రజలు సహాయము చేయటానికి ఏదో విధమైన కొన్ని సూచనలు యిస్తే, ఆ సూచనలు ఆచరణలో పెట్టటానికి ప్రభుత్వము ఖాతరుచేయనప్పుడు, యీ సమ్మెలకు కారణము ఎవరో ప్రభుత్వమే గుర్తించుకోవాలి. ప్రభుత్వము సమ్మెకు పరిష్కార మార్గము ఆలోచించకుండా నిర్లక్ష్యము చేయడం పరిపాటి అయిపోయింది.

ఇదే విధంగా నర్సాపురంలో ప్రభుత్వము న్యాయాన్యాయాలు కనిపెట్టక, కమ్యూనిస్టులమీద దుష్ప్రచారము సాగించారు. ప్రభుత్వము యీ దుష్ప్రచారానికి దోహదమివ్వడం సాగించింది. అక్కడ Bus owners కున్నూ, Bus workers కున్నూ వచ్చిన తగాదా ఏమిటి, దీనికి పరిష్కారమార్గము యేమిటి అని ప్రభుత్వము నిర్లక్ష్యము చేయకుండా వెంటనే తగాదా పరిష్కారము చేయటానికి ప్రభుత్వము ప్రయత్నించిందా? వర్కర్లకు ఏ విధంగాను సౌకర్యాలు చేయక పూరకుంటేగదా యీ సమ్మె అనేది వచ్చి పరిస్థితులుచెడిపోయినవి. ఇంత తీవ్రపరిస్థితులు ఏర్పడటానికి ఎవరు కారణము? ప్రభుత్వం వెంటనే యీ తగాదా పరిష్కరించియుంటే, సమ్మె జరిగేదేనా? ఇదంతా ప్రభుత్వం యెందుకు ఆలోచించదని ప్రశ్నించుచున్నాను.

మరొక చిన్న విషయం. ప్రభుత్వము చిన్న చిన్న వాటిలోకూడా అనవసరంగా జోక్యం కలిపించుకుంటోంది. బెజవాడ మునిసిపాలిటీ ఒక దృష్టాంతరంగా చెప్పారు. గుడివాడ మునిసిపాలిటీకూడా చెప్పారు. గుడివాడ మునిసిపల్ కౌన్సిల్ మీటింగ్ 4 గంటలకు జరుగుతుందనగా 1½ గంటకే Deputy Collector ఈ బడ్జెట్ చర్చించడానికి వీలులేదు, మీ ఆమోదం లేకుండానే ఈ బడ్జెట్‌ను ఆమోదించాం అని చెప్పి, ఈ బడ్జెట్ మీద సంతకంపెట్టి మునిసిపల్ కౌన్సిల్‌ను గొర్రెలమందలాగా వెలికి తోశేశాడట. అటువంటప్పుడు ఈ సంఘా లెందుకని నేను మంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను. మనం ఇప్పుడు బడ్జెట్ పాస్ చేస్తున్నాం అంటే ఈ వేసిన డబ్బును ప్రజల సహకారంతో

ఖర్చు పెడుతున్నాం అన్న మాట. సక్రమమైన రాజకీయ పరిపాలన చేయడానికి ప్రజల యొక్క అభిప్రాయాన్ని అనుసరించాలి. ప్రజాభిప్రాయాన్ని అనుసరించి వాళ్ళు no-confidence motion తెస్తే దాన్ని చర్చించడానికి వీలులేదని ఒక నిర్ణయంచేశారు. ఏ మాత్రం సంబంధం లేకపోతే ప్రభుత్వం ఇక్కడనుంచి ఒక ఆమోద ముద్ర వేయించి అక్కడున్నటువంటి సబ్ కలెక్టరుచేత మీ బడ్జెట్ మేము ఆమోదించాము అని ఒక ఆమోద ముద్ర వేయిస్తారు ? కాని యిటువంటివి సక్రమమైనవి కావు. ఇది బలహీనతను తెలియ పరుస్తుందే కాని బలాన్ని చేకూర్చదని చెపుతున్నాను. ఇదే కాక సభ్యులు యిచ్చిన సూచనలు అనేకం వున్నాయి. వాటన్నిటిని త్రోసివేయకుండా వున్నవి వున్నట్లుగా రిపోర్టులో మిగిలిపోకుండా చేసిన విమర్శలను, సూచనలను పరిశీలించి తగిన చర్య తీసుకోడానికి ఆర్డర్సు జారీచేసి, ఏఏ సభ్యులైతే మాట్లాడారో, వారు చెప్పిన విషయాలమీద ప్రభుత్వం తీసుకొన్న చర్యలనుగురించి ఆయా సభ్యులకు తెలియచేస్తారని ఆశిస్తూ యింతటితో ముగిస్తున్నాను.

The Hon. Sri T. VISWANATHAM :—అధ్యక్షా ! ఈ బడ్జెట్ సమావేశము చాలా రోజులు జరిగింది. ఈ బడ్జెట్ మీటింగ్ కు మనం అంతా కలుసుకొని చాలా శ్రమపడి, ఎండల్లో కూర్చునేందుకు సౌకర్యం లేకుండా బాధపడుతున్నప్పటికి అందరూకూడా సహృదయులు అవడంచేత మనం ఈ కార్యక్రమం నడిపించకలిగాం. ఈవేళ యీ అప్రోప్రియేషన్ బిల్ పాస్ చేసేప్పుడు మనం కేవలం ఫైనాన్షియల్ సైడ్ గానే మాట్లాడాం. డిమాండ్స్ మీద మాట్లాడినట్లు ఇక్కడ detailed గా మాట్లాడ్డానికి చాలా కష్టం అవుతుంది. జనరల్ discussion లో ఈ శాసన సభ్యులు చెప్పినవాటికి భోగట్టా తెప్పించి జవాబు చెప్పడానికి వీలుంటుంది. ఇది కడపటిరోజు. వ్యవధి తక్కువ. బడ్జెట్ స్పీచ్ లో చెప్పిన విషయాలే మళ్ళీ చెప్పారు. కాని నాగిరెడ్డిగారు స్పీచ్ క్లోజ్ చేస్తూ గుడివాడ మున్సిపాలిటీ విషయం చెప్పారు. దాని విషయంలో నాకు ఒక్క అక్షరం ముక్కకూడా తెలియదు. అనవసరంగా గొడవలు పెట్టుకోకుండా, నిజంగా నేను financial side గానే మాట్లాడుతున్నాను. ప్రథమంగా కృష్ణారావుగారు చెప్పారు, నాగిరెడ్డిగారు చెప్పారు. గ్రాంటు చేసిన కోట్లు ఏ విధంగా వీరు ఖర్చు పెడుతున్నారనేది మేము చూడ్డానికి మాకు ఎట్లా అవకాశం వుందని అడుగుతున్నారు. దీనికంతకి అమృతాంజనం మాదిరిగా ఒక ఎస్టిమేట్స్ కమిటీ ఒకటి వేయాలని చెప్పారు. ఎస్టిమేట్స్ కమిటీలు పార్లమెంటులోకూడా వున్నాయి. ఈ Public Accounts అన్నీకూడా ఆడిటర్ జనరల్, ఎకౌంటెంట్ జనరల్ కూడా చూచి రిపోర్టు వ్రాస్తారు.

Treasury Code, Public Works Code, Budget procedure మొదలైన వాటి నన్నిటిని పరిశీలించి, Legislature ఇచ్చిన డబ్బు ఏ విధంగా వినియోగం చేస్తున్నారు ? సరిగా చేస్తున్నారా, లేదా ? ఈ డిపార్టుమెంటల్ హెడ్స్ సరిగా ఖర్చు పెడుతున్నారా లేదా ? ఏమైనా exceed అయినారా ? శాంక్షన్ లేకుండా ఏమైనా ఖర్చు పెడుతున్నారా ? అని తీవ్రమయిన విమర్శ చేస్తారు. Accountant-General ఆఫీసులో వాళ్ళు చేసిన విమర్శలు చూస్తేమనం ఎటువంటి విమర్శ చేయవలసిన అవసరం లేదని మీకు తెలుస్తుంది.

ఇచ్చిన డబ్బు డిమాండ్‌లో ఉన్నటువంటి మాటల్లో ప్రతిఅక్షరం కూడా వారు చూస్తారు. పబ్లిక్ వర్క్సులో ఏదైనా ఒక పని జరుగుతోంది అనుకోండి. దీనిమీద Chief Engineer ఆర్డర్సు ఇస్తే ఆ విధంగా ఆర్డర్సు ఇవ్వడానికి ఆయనకు రూల్సు ప్రకారం హక్కు ఉందా లేదా అని చూస్తారు. ఏ ఉద్యోగి రూల్సుకు వ్యతిరేకంగా ఖర్చుచేయడానికి వీలులేదు. ఈ విషయంలో నాకు ఎటువంటి సందేహం లేదు. ఆవిధమైన సంతృప్తి Legislature లో అసెంబ్లీకూడా ఎందుకు పొందకూడదు. ఒక Estimates Committee వేస్తే estimates చేస్తాం అని చెప్పారు. ఈ Committee Appropriation Committee కాదు. అది Public Accounts Committee అవుతుంది. Audit Objections అన్నీ కూడా clear చేసి Accountant General చెప్పిన వాటికి డిపార్టుమెంట్ సరైన జవాబు చెప్పకపోతే అప్పుడు ఆయన Government కు ఒక letter వ్రాస్తాడు. Government కి కొంతవ్యవధి ఇస్తాడు. డబ్బు ఎట్లా ఖర్చు పెట్టారు, మొదలగు విషయాలన్నీ department ని అడిగి దాని మీద ఆయనకు సంతృప్తి కలుగకపోతే అప్పుడు Government కు వ్రాస్తాడు. ఈవిధమైన తతంగం అంతా ఉన్నప్పుడు, లెక్కలు తీయడం కొంత ఆలస్యం అవుతోంది. దాని విషయములో మీరు అట్టే బాధపడవలసిన అవసరం లేదు. ఇవన్నీ ఒక సంవత్సరములో అయ్యేవి కావు. 5, 6 సంవత్సరాలు ఆలస్యం పడుతుంది. ఇప్పుడు తుంగభద్ర Account ఉంది. ఇది దీనిమీద సంవత్సరం సంవత్సరం కోట్లకొద్దీ అయ్యేఖర్చు. ఇంతవరకు అది కాతాకు కోట్లకొద్దీ అవుతున్న పనికి 2, 3 ఏళ్ళు పడుతుంది. కాబట్టి దాని గురించి అట్టే బాధ అక్కరలేదు. ఎస్టిమేట్సు కమిటీ వేయడానికి ప్రోత్సాహం ఇస్తాం. దీన్ని ఇంకా సంపూర్ణముగా పరిశీలించలేదు. మనం British procedure కూడా పాటించినట్లైతే ఇంతకంటె ఎక్కువ పర్యవేక్షణ మన Accounts మీద జరుగుతుంది. Budget presentation అయిన తరవాత House ఒక కమిటీక్రింద form అవుతుంది. దానికి ఒక Chairman ఉంటాడు. బడ్జెటులో ఉన్నటువంటి విషయాలను మనం Select Committee లో బిల్లులోని క్లాజుల గురించి ఏ విధంగా చర్చ చేసుకుంటామో ఆ విధంగా వారు చర్చ చేసుకుంటారు. వాదాలు అక్కరలేకుండా మధ్యాహ్నమో, రాత్రో కూర్చొని ఈ కార్యక్రమము అంతా చేసుకుపోతారు.

బడ్జెట్‌లో బిల్లులు చర్చిస్తూ వుంటారు. 20, 25, రోజులు అయిన తర్వాత తీర్మానాలుగా అయి దానిమీద బడ్జెట్ చర్చ 2, 3 రోజులు జరుగుతుంది. Vote on account అని ఆగస్టునెల చివరివరకు పుచ్చుకుంటారు. ఆవిధంగా పుచ్చుకోవడం వల్ల House అంతా Committee of Supplies క్రింద మారిపోయి బడ్జెటు పరిశీలించి జూలై చివరకు బడ్జెట్ ప్యాస్ చేస్తూ వుంటారు. అట్లాచేస్తే ప్రతీదీ సావకాశంగా చేసుకోడానికి వీలుంటుంది. పార్లమెంటు proceedings చూస్తే వాళ్ళు మన మోస్తరుగా చర్చ చేసినట్లు అవిక నిపించదు. ఇదంతా Committee of Supplies క్రింద మారిపోతుంది. అప్పుడు ప్రతి

విషయంమీద సభ్యులకు సంతృప్తి వుంటుంది. ఇక్కడ మనం చర్చించినట్లుగా ఉదయగిరి తాలూకాలో చెరువులు త్రవ్వించలేదు, కొవ్వూరు తాలూకాలో మరొకటి చెయ్యలేదు, లేకపోతే contingencies వేశారా లేదా అని చర్చ చెయ్యనక్కరలేదు. ఒక్క క్షణంకూడా కాలయాపన చెయ్యకుండా కార్య కలాపాలు ప్రవాహంలా జరిగిపోతూ వుంటాయి. మీ రేదైనా చెప్పేటప్పటికి దానికి సంబంధించిన ఉద్యోగస్తుణ్ణి పిలిచి information తీసుకునేవరకు కార్య క్రమం ఆపుదామనే అవసరంలేదు. అట్లా చెయ్యడంవల్ల హెచ్చుభాగం సంతృప్తి వుంటుంది. మనంకూడా అదేవిధంగా చేసుకునేటందుకుగాను మన రూల్సు మార్చుకునేందుకు ఒక రూల్సు కమిటీని వేశాము. అందులో అన్నిపార్టీలవారు వున్నారు. ఇంతో అంతో ప్రతివారికి అనుభవం వున్నది. మనం కూర్చుని ఒక యేర్పాటుకువస్తే ప్రభుత్వపక్షంనుంచి మాకే పట్టింపు లేదు. ఆ రూల్సు కమిటీ వారు ఒక నిర్ణయానికివస్తే ఆ ప్రకారంగా మార్చడానికి అభ్యంతరం వుండదు.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Supplies Committee కిన్నీ ఎస్టిమేట్ల కమిటీకిన్నీ చాలా తేడా కనిపిస్తోంది. మనకు పాత డెమోక్రసీ వలె కాకుండా Suppliers Committee ఎస్టిమేట్ల కమిటీ కూడా వున్నట్లయితే ఆ power అంతా మన House కే వుంటుంది. అందరూ పాల్గొనడానికి వీలుంటుంది. అది మీకు కూడా తెలుసు.

"To report what, if any, economies consistent with the policy underlying those estimates may be effected therein and to suggest the term in which the estimates shall be presented to parliament." అనే విషయాలు వున్నందువల్ల Supplies Committee కే కాకుండా general discussion కు కూడా ఉపయోగపడుతుంది. ఇది old democracy కాక new democracy కాక fresh democracy కి మనం పోవచ్చు.

The Hon. Sri T. VISWANATHAM : — మొత్తంమీద మనందరికి దీంట్లో వున్న వ్యవహారం తెలియాలి. మనం కమిటీని అందరికి representation వుండడంకోసం వేసుకోవచ్చు. కాని వివరాలలోకి ఇప్పుడు వెళ్ళకుండా మనం రూల్సు కమిటీని వేసుకున్నాం కాబట్టి ఏ యే పార్లమెంటులో ఏ యే విధంగా జరుగుతోందో చూద్దామని చెప్పాను. ప్రభుత్వపక్షంనుంచి మాకు పట్టింపుగాని అభ్యంతరంకాని లేదనికూడా చెప్పాను. కాని ముఖ్యమైన విషయం ఏమిటంటే నిర్ణీతమైన కాలంలో బడ్జెట్ పూర్తవడానికి అందరూ వప్పుకోవాలి. నిర్ణీతమైన కాలం ప్రకారం మీ రేపని చేసినా మాకభ్యంతరంలేదు. మనం బాధ్యతతో పనిని నిర్వహించడానికిగాను మీకు కావలసిన details అన్నీ ప్రభుత్వం యిస్తుంది.

చాలామంది సభ్యులు చాలా వివరాలకు వెళ్లారు. 'మా జిల్లాలో మైనర్ ఇరిగేషన్ స్కీములు ఏమి చేస్తున్నారు' అని వెంకటస్వామిరెడ్డిగారు, శంకరయ్య గారు ఇంకా కొంతమంది అడిగారు. ఏ యే తాలూకాలలో ఏ యే స్కీములు చెయ్యబోతున్నామో ఇప్పుడు చదవడంవల్ల చాలా ఆలశ్యం అవుతుంది. మొత్తం 182 మైనర్ ఇరిగేషన్ స్కీములు ప్రభుత్వం చెయ్యబోతోంది. ప్రత్యేకంగా చెరువుల మరమ్మతుకు 2 కోట్ల రూపాయలు, మైనర్ ఇరిగేషన్ స్కీములకు 2 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి 1955-56 సంవత్సరం నాటికి పని పూర్తిచెయ్యడానికి ఏర్పాటు జరిగాయి. పెద్ద capital works కు గాను కేటాయించిన

7 కోట్ల రూపాయలు కాక 5 కోట్ల రూపాయలు scarcity areas లో కేటాయించింది కాక, 2 కోట్ల రూపాయలు minor irrigation పనులకు 2 కోట్లు చెరువులకు ఖర్చుపెట్టి అవి 1956 ఏప్రెల్ నాటికి ఖర్చుచెయ్యడానికి నిశ్చయించాము. మొత్తం 14 కోట్ల రూపాయలు 1955 సం॥రం ఏప్రెల్ నాటికి ఖర్చుపెడుతున్నాము. కాబట్టి దేశం మొత్తంమీద Agriccultural works కు labour కు పనులు దొరకడమే కాకుండా దేశంలో ఎన్నో పనులు చేసినవాళ్ళం అవుతాం. ఇంతచిన్నరాష్ట్రంలో రెండేండ్లలో 14 మొదలు 16 కోట్ల రూపాయలు Capital expenditure 12 జిల్లాలలో పెట్టడం సులభంకాదు. మన రాష్ట్రం బాగా వెనకపడ్డ దవడంచేత దీనిని ముందుకు తీసుకు వెడదామనే వుత్సాహం వుండడం వల్ల కేంద్ర ప్రభుత్వం దగ్గరకు వెళ్ళి మీరు తప్పక సహాయం చెయ్యాలని చెప్పి సహాయము తీసుకువచ్చాము. ఇవి గాక scarcity areas లో minor irrigation schemes కు ఖర్చు పెట్టడంకోసం మరొక 2 కోట్లు కేంద్ర ప్రభుత్వాన్ని అడుగుతున్నాము. అది కూడా కొద్ది కాలంలోనే మంజూ రవుతుందని ఆశిస్తున్నాను. ఇందులో ఒక విషయం గమనించాలి. కేంద్ర ప్రభుత్వం మనకు ఈ డబ్బు గ్రాంటుగా కాకుండా అప్పుగా మాత్రం యిస్తున్నారు. వడ్డీకూడా చెల్లించుకోవాలి. మనకు అవసరం వచ్చినప్పుడు అప్పు ఇచ్చినవారు దైవంతో సమానమే. మనం తెచ్చిన అప్పుకు వడ్డీ తీర్చే ప్రాప్తికైనా మనం పన్నులు వేసుకోకపోతే అప్పు ఏవిధంగా యిస్తారు? మాట మాటకి, అయినదానికి కానిదానికి పన్నులు వేస్తున్నారని నలుగురిచేత మాటలనిపించుకోవడం మాకు మాత్రం మంచిదా? ఎదుటి పక్షంవారు మాత్రం ఆవిధంగా అనుకోకూడదు. మనం 16 కోట్ల రూపాయలు రాష్ట్రంలో ఖర్చు పెట్టేటప్పుడు వడ్డీ ప్రాప్తికి 64 లక్షలు పన్నులుగా వసూలుచేసుకుంటే మిగతా డబ్బు మన రెవెన్యూలోనుంచి తీసి అప్పు చెల్లించుకుంటాము. మనది లోటు రాష్ట్రం కాబట్టిన్నీ, దానికితోడు సంవత్సరానికి 64 లక్షలు వడ్డీ చెల్లించాలి కాబట్టిన్నీ మన ఆర్థికస్తోమతును పెంచుకోడానికి 64 లక్షలు మాత్రం వడ్డీ ప్రాప్తికి అదనపు పన్నులు వేసుకుంటున్నాము. అంతకంటె ఎక్కువ పన్నులు వేసుకోవడం మంచిదికాదని కేంద్ర పభుత్వంతో చెప్పాము. మనం ఈ మాత్రం కూడా పన్నులు వేసుకోకపోతే వారిదగ్గరనుంచి మనకు ఈమాత్రం అప్పుకూడా దొరకడం కష్టం అయ్యేది.

ఒక కోటిరూపాయలు భర్తీ చేసుకోనేందుకు, మనం కొన్ని పన్నులు వేసుకుంటాము. మనకు మనకు డబ్బు తక్కువైతే ఎవరినైనా అప్పు అడుగుతాము. అలాగే ఇపుడు మనము ఇండియా ప్రభుత్వంవారి దగ్గర అప్పు తీసుకుంటున్నాము మనం లోటును భర్తీచేసుకోడానికిగాను ఈ పన్నులు వేయాలి. మనం ఈపన్నులు వేయకపోతే అప్పులు యిచ్చేవారు యివ్వరు. మనం ఈ పన్నులు వేయకపోతే ఏంజరుగుతుందంటే, పన్నులు వేయకపోతే మీరింక ఈ అప్పెలా తీరుస్తారు, అని చెప్పి అవతలివారు అప్పు యివ్వడానికికూడా ఒప్పుకోరు. అందుచేత మనం ఈ పన్నులను వేయడం జరుగుతోంది. ఈ పన్ను పేదరైతాంగం చెల్లించ నవసరం లేకుండానే వేస్తున్నాము. మనం అప్పు తెచ్చినది రాష్ట్రాభివృద్ధికి మాత్రమే.

ఈ అప్పును తీర్చాలంటే ఏమాత్రం excess పన్నులు వేయకుండా సాధ్యం కాదు. ఈ పన్నులను కేవలం అభివృద్ధి పన్నులుగా మాత్రమే వేస్తున్నాము. ఈ పన్నులు వేయటమనేది సాధారణంగా, అప్పులకు యివ్వవలసినది excess అయిపోతే అభివృద్ధి పన్నులు ఎన్నో ఎక్కువైపోతాయి. ఈ పన్నులను విధించడంలో పేద ప్రజానీకానికి, పేద రైతాంగానికి సంబదించిన పన్నులను పెంచదలచుకోలేదు. ఈ పన్నులను ఈవిధంగా పెంచడం చాలా తప్పు అని చాలా మంది సభ్యులు అన్నారు. ఈ రాష్ట్రాభివృద్ధికి, ఇంత అప్పుచేయడమనేది సంభవించినపుడు ఈ మాత్రం పన్నులను పెంచకపోతే ఎలాగో సభ్యులంతా ఆలోచించాలని మనవిచేస్తున్నాను. తరువాత చాలామంది సభ్యులు మాట్లాడుతూ బడ్జెట్‌లో అంకెలు మాత్రమే కనపడతాయి, అవేమిటో? ఎందుకో? దేనికి సంబంధించినవో? తెలియడంలేదు. బడ్జెట్ అంతా అంకెలే 'ఉన్నాయి', అన్నారు.

ఈ అంకెలు ఎందుకున్నాయో, అదేమిటో, వేటికి సంబంధించినవో, బడ్జెట్ మెమొరాండం అంతా చదివితే అర్థం అవుతుంది. బడ్జెట్ మెమొరాండం అంతా చదవడం కష్టమే. తరువాత Detailed Budget Estimates అని యింకకో పుస్తకము ఉంది. ఈ రెంటిలోను ఒకదానికి సంబంధించిన అంకెలే వుంటాయి. ఈ రెండూ చదివి సమన్వయం చేసుకోవాలి. అపుడు మీకు ఈ అంకెలు ఎలా వచ్చాయో, ఏమిటో అంతా మీకు అర్థం అవుతుంది. అయితే ఈ రెండు చదవడానికి చాలా కష్టమే. ఉసలు బడ్జెట్ మెమొరాండం చూస్తేనే యివన్నీ అర్థం అవడానికి గాను యింకా క్రొత్త arrangements క్రొత్త పద్ధతిలో చేయవచ్చు. కాని మనకు Press పెద్దది లేదు. Equipment తక్కువ. ఈ Budget కు సంబంధించిన పుస్తకాలన్నీ మద్రాసు Government Press లోనే అచ్చు వేయబడ్డాయి. ఇక్కడున్న Press లో ఏమీ అచ్చువేయడానికి సౌకర్యం లేదు. చాలా చిన్నది. దీనికిగాను ఒక building కట్టించుతున్నాము. అది పూర్తయిన తరువాత కొంచెం ఎక్కువ printing సౌకర్యాలు వుంటాయనుకుంటాను. ఆ building పూర్తయిన తరువాత మద్రాసులో వుండిపోయిన printing సామగ్రి అంతా ఇక్కడికి తెచ్చుకోడానికి అవకాశం వుంటుంది. అసలు Budget Memorandum లో అన్ని డిమాండ్లకు సంబంధించిన Appendix వున్నాయి. అవిచూస్తే, వాటిలో అన్ని డిమాండ్లకు సంబంధించిన అన్ని వివరాలు వుంటాయి. ఇప్పుడు ఉదాహరణకు Irrigation Demand గాని, Minor Irrigation Demand గాని వుంటే దానిపైన ఏ విధంగా ఎంతెంత డబ్బు ఖర్చు పెట్టబడేది, దాని appropriation అన్ని వివరాలు ఈ appendix లో వేసే వుంటాయి. మొత్తం అన్ని వివరాలు బడ్జెట్ మెమొరాండంలో ఒక statement రూపములో వేసి ఉంటాయి.

తరువాత Budget Memorandum లో Annexure క్రింద కూడా వివరాలు పూర్తిగా ఉంటాయి. వీటినన్నిటికి కూడా ఒక బడ్జెట్ Memorandum చూడగానే అర్థమయ్యేటట్లు కొత్తపద్ధతిలో print చేయడానికి కొన్ని arrangements చేశాము, అవన్నీ press సౌకర్యములులేక చేయటంలేదు.

నాగిరెడ్డిగారు చెప్పారు "ఒక ఏ చిన్న ఖర్చుచేసినా, ప్రభుత్వం ఏ ఖర్చు చేసినా దానిగురించి లెక్క తెలియటంలేదు, ఆ ఖర్చు వివరాలు చూపే complete skeleton statement లేదు," అని. వివరాలన్నీ Budget Memorandum లో Appendix లో ఉంటాయి. ప్రభుత్వం చేసే ప్రతి ఖర్చు కూడా, బడ్జెట్‌లోని అన్ని అంకెలు ఈ Appendix లో ఉంటాయి. ప్రభుత్వం చేసే ఖర్చుకు ఈ అంకెలకు గల సంబంధం ఏమిటో ఈ Budget Memorandam లో ఉంటాయి. ఈ బడ్జెట్ మెమోరాండం అంతా పూర్తిగా చదివితే అర్థం అవుతుంది మీకు. అంతే కాని, దీనిలో ప్రతి Demand కు సంబంధించిన ఖర్చులు అంటే ఇదివరకు ఎంత దేనికై ఖర్చుపెట్టిందో మున్ముందు ఏమి ఖర్చులు పెట్టదలచుకున్నది అన్నీ వివరాలు statement రూపంలో, Appendix లోను Annexure లోను ఉంటాయి. ఈ బడ్జెట్‌కు మెమొరాండం అంతా చదవడం కష్టమే. వచ్చే సంవత్సరానికి ఇంకా బాగుగా ఒక బడ్జెట్ మెమొరాండం చూసేటప్పటికి అంతా అర్థమయ్యేలాగ వివరాలతో ప్రతి డిమాండ్‌కు Introduction తో సహా బడ్జెట్‌లోనే చేర్చి print చేయడానికి ఏర్పాటుచేస్తాము. ఈ పని చేయడానికి మాకేమీ పనిబద్ధకం ఏమీలేదు. Printing యిక్కడ చేయడానికి యిక్కడ press లో equipment లేని యిబ్బందివల్లనే ఈ మార్పు చేయలేదని మీకు మనవి చేస్తున్నాను.

ఇంకా ఇతర విషయాలెన్నో చాలా మంది సభ్యులు మనవిచేశారు. ముఖ్యంగా ఇర్రిగేషన్ tanks విషయంగురించి చాలామంది సభ్యులు మనవిచేశారు. వాటి గురించి ఇందులో వివరాలు వేయడానికి అవకాశం లేకపోయింది. ఎవరైనా స్నేహితులు నాదగ్గరకు వచ్చి అడిగితే ఏ ఏ tanks గురించి ఏ ఏ వివరాలడిగినా చెప్పడానికి సిద్ధంగాఉన్నాను. చెప్పతాను. తరువాత backward areasఅంటూ అక్కడ ఏమీ పనులు చేయడం లేదంటున్నారు. backward areas అంటే శ్రీకాకుళం, రాయలసీమ ప్రాంతాలే అంటున్నారు. మధ్య గుంటూరు, నెల్లూరులు మరిచి అమలాపురం, అనేటటువంటివి బ్రహ్మాండ నాగరికమైన ప్రదేశాలుకావు. అక్కడేమి ఉన్నాయి? పరిశ్రమ లేమైనా ఉన్నాయా అంటే అవిలేవు. అమలాపురంప్రాంతంలోమాత్రం పచ్చగా కొబ్బరితోటలు, కొంచెం అరటితోటలు కన్పిస్తాయి. తరువాత రాయలసీమ ప్రాంతములో కొండ ప్రాంతము కన్పిస్తుంది. కాని మహత్తరమైన వేమో అమలాపురం ప్రాంతములో లేవు. ఇంకా హీనంగా చాలా ప్రదేశాలున్నాయి. అసలు మన రాష్ట్రమే backward గా ఉందన్న సంగతి గుర్తించాలి. ప్రతిమనిషికి మనస్సులో ఇది నా స్వంతరాష్ట్రము అని ఇది నా రాష్ట్రం అని, సక్రమంగా నా రాష్ట్రం సాగిపోగలదని ఒక సంతృప్తిని మేము కల్గించడానికి ప్రయత్నిస్తున్నాము. ఇది మారాష్ట్రం, మేము మా జీవితాలకు ఏ మాత్రము లోటులేకుండా ఉండగలదు అని 2 కోట్ల ప్రజల్లో ప్రతివ్యక్తీ కూడా మనస్సులో సంతృప్తిని కల్గించడానికి సర్వదా కృషిచేస్తున్నాము. ఈ రాష్ట్రంలో 2 కోట్ల ప్రజలంతా కలిసి రాష్ట్రాన్ని సక్రమంగా నడిచేటట్లు చూస్తామని, మాకేమీ మా రాష్ట్రంలో ఏమీ లోటులేదని ప్రతి మనిషి మనసులో సంతృప్తి చెందేలాగ చూస్తాము. చాలామంది సభ్యులు, 6 నెలలై మనకు రాష్ట్రం వచ్చినా, పరిపాలనలో గాని,

ఏవిషయంలో గాని చెప్పుకోదగ్గ మార్పు రాలేద"న్నారు. 200 ల సంవత్సరాలుగా వున్న పద్ధతిని వెంటనే ఒక్కమారుగా మార్చుకోవాలంటే చాలా కష్టం. అందుచేత యిప్పుడు మనం వెంటనే పద్ధతి మార్చుకోవాలంటే సాధ్య పడదు. క్రమక్రమంగా పద్ధతి మార్చుకోవాలి. తర్వాత అప్పుల విషయమై వాటి వసూలు postpone చేయాలని అన్నారు. ఈ విషయములోను బంజరు భూముల విషయంలోనూ 5 వారాల క్రితం కొంతమంది స్నేహితులు మాట్లాడారు. ఈ విషయాల గురించి కూడా త్వరలోనే ఒక నిర్ణీతమైన కార్యక్రమానికి రాగలమని ప్రభుత్వం ప్రకటించారని నేను మనవి చేస్తున్నాను. తరువాత నేను ముఖ్యంగా సభ్యులందరకు అధ్యక్షులవారికి నా కృతజ్ఞత తెలియ జేయవలసి ఉంది. ఇంత దూరమైన, కష్టమైన, వేడియైన, సౌకర్యములులేని ప్రదేశంలో మీరంతా యిన్నిరోజు లుండి చాలా సునిశితమైన దృష్టితో విమర్శనా శక్తితో, ఓర్పుతో, 6 వారాలపాటు ఉండి, చాలామంది అనేకమైన విషయాలను వారి విమర్శలతో సూచించారు. ఆ విమర్శలలో వున్నటువంటి మంచి విషయాల నన్నింటిని గ్రహించి, వాటిని గురించి తగినటువంటి చర్యలు తీసుకొని ఆర్డర్లు జారీచేయడానికి సిద్ధంగా ఉన్నాము. గౌరవసభ్యులు చాలా విమర్శలను, సూచనలను చేశారు. ఆ విమర్శలకు పూర్తిగా ఆ యా శాసన సభ్యులకు జవాబులు చెప్పలేక పోయాను. ప్రతి శాసన సభ్యుని విమర్శలకు జవాబు యిస్తే వారికి చాలా సంతృప్తి కల్గించినట్లు అవుతుంది. కొంతమంది సభ్యుల విమర్శలకు మాత్రమే జవాబు యివ్వగలిగాను. ఇపుడు దాదాపు మొత్తం 50, 60 మంది సభ్యులు వారి వారి విమర్శలను వారి ఉపన్యాసాలలో తెలియ జేశారు. వాటి అన్నింటికి జవాబు యివ్వటం కష్టమైనపనే. అసలు అందరి విమర్శలకు జవాబు యివ్వడమనేటటు వంటిది చాలా న్యాయమైనటువంటిది. అసలు నాకు 2 గంటలు మాత్రమే జవాబు యివ్వటానికి వ్యవధి వుంది. అందరికి జవాబులు యివ్వటానికి వ్యవధలేదు. సభ్యులందరి విమర్శలకు ముందుగా వ్రాతపూర్వకంగా జవాబులు పంపడానికి ఏర్పాట్లు చేస్తున్నామని చెప్తున్నాను. అందరి సభ్యులకు జవాబు చెప్పలేక పోయినందుకు తిరిగి సభ్యులందర్ని క్షమించ వలసిందిగా కోరుతున్నాను. అన్ని విషయాలను చెప్పడానికి ఇప్పుడు నేను హెచ్చు కాలాన్ని తీసుకో దల్చుకోలేదు. గత 5 వారాలుగా ఇంతదూరమైన, అసౌకర్యమైన, వేడియైన ప్రదేశంలో ఓర్పుతో ఇక్కడ సభలో ఉండి ఈ బడ్జెట్‌ను Pass చేసినందుకు నేను మరోసారి మీకందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములను తెలియ జేస్తున్నాను. ఈ సమావేశ కాలంలో మనం అందరం చాలా ఉత్సాహమైన కాలమూ గడిపాము, చాలా నిరుత్సాహముగానూ కాలం గడిపాము. ముఖ్యంగా మన అధ్యక్షులవారు ఈ సమావేశ కాలంలో చాలా ఓర్పుతో, చాలా జాగరూకతతో, సమర్థతతో శాంతియుతంగా కార్యక్రమాన్ని నడిపారు. వారుకూడా ఉత్సాహంగానే కాలంగడిపారు. వారికికూడా నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభి వందనముల నర్పిస్తున్నాను.

తరువాత Legislature Secretariat Staff, Secretariat Staff ఈ సమావేశ కాలంలో చాలా తొందరతో చాలా శక్యంగా, కష్టపడిపని చేశారు. అసలు శాసనసభా సమావేశం ఉంటేనే, ముఖ్యంగా

Secretariat Staff వారికి Secretariat వారికి పని చాలా ఎక్కువగా ఉంటుంది. అందులోను ఇది బడ్జెట్ సమావేశం. అందువల్ల ఈ రెండుఆఫీసులలోని staff చాలా తొందరతో, బ్రహ్మాండమైన కష్టంతో ఎక్కువగా పనిచేయవలసి వస్తుంది. అసలు Secretariat లో మామూలురోజులలోనే ఏవైనా file కావాలంటే అది పైకి వచ్చేటప్పటికి 2 గంటల కాలం పడుతుంది. అలాంటప్పుడు Budget Session ఉండంటేవారికి యింకా ఎక్కువ కష్టంగా ఉంటుంది. అందులో ముఖ్యంగా Legislature Secretariat వారు హెచ్చు తొందరతో బ్రహ్మాండమైన కష్టంతో పనిచేయవలసి వస్తుంది. అందుచేత Legislature Secretariat Staff కు, Government Secretariat Staff కు నా కృతజ్ఞతను తెలియ జేస్తున్నాను. ఇంత ఓర్పుతో, ఇంతకష్టంతో, ఇంతదూరమైన, వేడియైన, అసౌకర్యమైన ఈ ప్రదేశంలో మీరు. 5, 6 వారాలుపాటు ఉండి ఈ శాసనసభా బడ్జెట్ సమావేశాన్ని సక్రమంగా జయప్రదంగా కొనసాగించి ఈ బడ్జెట్‌ను పాస్ చేసినందుకు అందరికీ, ఇచ్చట అన్నివిధములైన ఇబ్బందులున్నా గొప్ప ఓర్పువహించి ఇచ్చట ఉండి, అధ్యక్షపీఠాన్ని అలంకరించి సమావేశాన్ని సక్రమంగానడిపి కార్యక్రమాన్ని సత్యంగా జాగరూకతతో నిర్వహించినందుకు అధ్యక్షుల వారికి, ఈబడ్జెట్ సమావేశంలో Legislature Secretariat వారు Government Secretariat వారు బ్రహ్మాండమైన కష్టంతో అతి తొందరతో పనిచేసి మనకు 5, 6 వారాలుగా సహాయపడినందుకు వారికి నేను ప్రభుత్వము తరఫునా, నా తరఫున నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనాలను తెలియజేస్తూ Appropriation Bill ను పాస్ చేయవలసిందిగా మీ అందరినీ కోరుతున్నాను.

Sri C. V. K. RAO:—కొంచెం clarification కోరుతున్నాను. మంత్రిగారు యిచ్చిన జవాబునుబట్టి ఆంధ్ర ప్రజలమీద పన్నులభారం వేసేటట్లు కనిపిస్తుంది. Central Government యిచ్చిన అప్పులమీద మారటోరియం ప్రకటించాలి అని కోరుతూ, grants ఎక్కువగా యివ్వాలి అని కోరకూడదా అని సూచిస్తున్నాను.

The Hon. Sri T. VISWANATHAM:—నేను చాలా కష్టపడి చెప్పింది ఏమిటంటే, మనకు మూడు కోట్ల 60 లక్షల రూపాయలవరకు లోటు వున్నప్పుడు మనం వేసే పన్నులు ఒక కోటికూడా కాదన్నప్పుడు, ఆంధ్ర ప్రజానీకంమీద మోయలేని tax భారం finance minister వేస్తున్నాడు అని చెప్పడం 25% right మాత్రమేనని, మనం చేసే అప్పులమీద వడ్డీ ప్రాప్తికైనా పన్ను వసూలు అయేట్లు చూసుకోకపోతే చాలా కష్టం అని మనవిచేసాను. అప్పుల మీద మారటోరియం ప్రకటించాలి అని కోరితే ఎవరు అప్పు యిస్తారు; ఇటువంటి ప్రకటనలు ఈ సభాముఖంగా చేయడంలో ఏమి స్వారస్యం వున్నదో గ్రహించండి. గ్రాంట్లు విషయం చాలావరకు మాట్లాడుతాం. మనం 14 కోట్లు రూపాయలు ప్రణాళికలమీద ఖర్చుపెట్టిన తరువాత చాలామంచి ఫలితాలు

కలుగుతాయి. మన పలుకుబడి పెరుగుతుంది. ఢిల్లీకి ఆంధ్ర ప్రభుత్వం తరఫున మనుష్యులు వెళ్ళేసరికి, చంద్రోదయం అయితే వెలుగు వచ్చేటట్లుగా, మన మాట అంతా చెల్లుబడి అవుతుంది. అందుకు అనుగుణంగా అందరూ నడుచుకోవాలి అని నేను కోరుచున్నాను.

Mr. SPEAKER :—The question is :

'That the Andhra Appropriation (No. 3) Bill, 1954, be taken into consideration."

The motion was carried.

Clause 2 was put and carried.

The Schedule was put and carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

The Hon Sri T. VISWANATHAM :—Mr. Speaker, Sir, I beg to move :

"That the Andhra Appropriation (No. 3) Bill, 1954, be passed into law."

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Third reading ఒకసారి అయితే వెంటనే తీసుకురావడానికి వీలులేదు. దానికి కారణాలు వున్నాయండి. Rule 98 చూడండి.

98. (1) If, when a Bill is considered in the Assembly, no amendment is made, the member in charge of it may, at the conclusion of such consideration, move that the Bill be passed.

(2) If, when a Bill is considered, any amendment is made, any member may, at the conclusion of the consideration of the Bill, object to a motion being made at the same sitting for its being passed. Thereupon the Speaker shall, unless he considers that the request is frivolous or unreasonable, not allow a motion that the Bill be passed into law to be moved at the same sitting, but the Bill shall be brought up for further consideration at a subsequent sitting.

Rule 98 (2) కూడా బాగా చూడండి. Amendments నేను యిచ్చాను. ఇంగ్లీషు నాకు బాగారాదు. విశ్వనాథంగారు చెబితే బాగుంటుంది.

The Hon. Sri T. VISWANATHAM :—మీరే దానికి జవాబు కూడా చెప్పేసారు, frivolous and unreasonable request అని.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— నేను అభ్యంతరం కోసం చెప్పాను అంటే చర్చ చేయడానికి వీలులేదు.

Sri C. V. K. RAO :— గోపాలకృష్ణయ్య గారు frivolous అనేదానిమండి immunity కోరుతున్నారు.

The Hon. Sri T. VISWANATHAM : — ఆయనకు immunity ఇచ్చేసా మండి.

Mr. SPEAKER: The question is:

"That the Andhra Appropriation (No. 3) Bill, 1954, be passed into law"

The motion was carried and the Bill was passed into law.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Further discussion కు వెళ్ళేముందు ఒక మనవి వున్నది. Non-official day వచ్చే ముందు శాసనసభ adjourn అవుతోంది. క్రిందటిసారి non-official day పోయింది. ఒకటవతారీఖు non-official day గా చేయమని కోరుతున్నాను. మొదట 2-వ తారీఖును పెడతాం అనుకున్నాము. ఇప్పుడు ఈవేళ రాత్రికే పెడతాం అని అంటున్నారు. రెండవ తారీఖు వరకు వుంటే 1-వ తారీఖు non-official day గా చేయాలని కోరుతున్నాను.

The Hon. Sri T. VISWANATHAM :— 1, 2 తారీఖులలో సమావేశం కావడంలేదు. రెండోఛార్జి ఏమిటంటే non-official day పెట్టలేదని. ఇంత వరకు ఏ అసెంబ్లీ కూడా చేయనంత non-official work మనం ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత చేశాము. బంజరుభూముల resolution pass చేశాము. గోపాల కృష్ణయ్యగారి Bill introduce చేశాము. ఏ అంసెబ్లీకూడా యింత non-official work చేయలేదు. Budget Session లో General Discussion లోనే non-official గా మాట్లాడవలసినది మాట్లాడారు. అదే విధంగా Supplementary questions అడిగినప్పుడు, Appropriation Bill పై చర్చ లో non-official business అంతా మాట్లాడారు.

Sri T. NAGI REDDI :— మాకు మీరు ఒక non - official day బాకీ వున్నారు. ఎప్పుడిస్తారు అన్నదే ప్రశ్న.

The Hon. Sri. T. VISWANATHAM :— ఎప్పుడు వీలుగా వుంటే అప్పుడు మీరే తీసుకోండి.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— మేము యిప్పుడు సిద్ధంగా వున్నాం. ఎప్పుడు కావాల్సింటే అప్పుడే సిద్ధంగా వున్నాం. జవాబు చెప్పండి.

Mr. SPEAKER :— We will meet again at 4-20 this evening.

After lunch-4-20 p. m.

## ADJOURNMENT MOTION RE: DISTURBANCE IN PUBLIC MEETING AT NANDIKOTKUR ON 28—3—1954

Sri K. RAJAGOPALA RAO:— అధ్యక్షా ! ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ అక్షేపేపు మాట్లాడాలని అనుకోవడంలేదు. కొన్ని ముఖ్యవిషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకు రావాలని చూస్తున్నాను. ఇందుకు గౌరవనీయులైన సంజీవరెడ్డిగారు యిచ్చిన జవాబుమాస్తే spirit of the motion సరిగా తీసుకున్నట్లు కనుపించలేదు. ఆయన చేయించారని ఆరోపణ కోసము, లేకపోతే నాగిరెడ్డిగారు, హనుమంతరావుగారు ఏమి provoke చేస్తే యిది జరిగిందో అన్న శంకలను లేపడంకోసం ప్రతిపాదించలేదు. ప్రభుత్వం తాను అవలంబించే విధానాన్ని క్రమంగా affective గా అమలు పరిచి

నట్లయితే యిటువంటివి జరిగేవి కాదన్న విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకు రావడానికి దీనిని ప్రతిపాదించవలవచ్చినది. మంత్రులకుమల్లే పోలీసుబందోబస్తు Leader of the Opposition కు కావాలని కోరడంలేదు. Police లు తాము చేయవలసిన విధిని సక్రమంగా న్యాయంగా అమలు పరచేటట్లు చేయవలసిన బాధ్యత ప్రభుత్వంపై వున్నది, అన్న విషయం ప్రధానంగా ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచాను. మీటింగు జరుగుతున్న స్థలానికి 1½ ఫర్లాంగుల దూరంలోనే ఒక Police Station వున్నది. అది కుగ్రామం కాదు. Sub Inspector, Circle Inspector కూడా వున్నారు. ఇంతగలాటా గంటన్నరసేపు నుండీ జరుగుతున్నప్పటికీ వారికి తెలియదా? కాంగ్రెసు ముసుగు వేసుకుని సంజీవరెడ్డిగారి స్నేహితులమని పేరుపెట్టుకుని అధికారులను transfer చేయిస్తామని బెదరించే సుబ్బారెడ్డిగారివంటి పెత్తందారులు చెప్పినదికాదని, Police లు తమ duty లు సక్రమంగా నిర్వహించేటట్లు చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను. మంత్రులకు మల్లే పోలీసు బందోబస్తు పెట్టుకోనే దుర్గతి Leader of the Opposition కు యింకా పట్టలేదు. సుబ్బారెడ్డిగారి నాయకత్వం క్రింద యీ దురంతం జరిగింది. పోలీసులు భయపడి అక్కడకు రాలేకపోయారు. నరసాపురంలో యిటువంటివే జరిగినసంగతి నాగిరెడ్డిగారు చెప్పారు. అక్కడ ఎంతహంగామా, ఎంత harassment చేశారో చెప్పారు. ఇలాంటి పరిస్థితుల్లో ఏమి instructionsయిచ్చారు? Subba Reddi బలగం యిట్లా చేస్తుంటే పోలీసులు ఏమిచేస్తున్నారు? Is it not the duty of the Police Department? ఇవన్నీ ప్రభుత్వదృష్టికితెస్తూ యికముందు పోలీసులు తమవిధిని సక్రమంగా నిర్వహించేటట్లు చర్య తీసుకోవలసినదిగా కోరుతూ, యిప్పుడు జరిగినదానికి ఎవరు బాధ్యులో వారిపై చర్యతీసుకోవాలని మనవిచేస్తూ ముగిస్తున్నాను.

Sri C PULLA REDDI:— అధ్యక్షా, ఇలాంటి సమస్యలు వచ్చినప్పుడు నేను మొట్టమొదట సంజీవరెడ్డి గారికే ప్రధానంగా విజ్ఞప్తి చేసేదేమిటంటే యీ తీర్మానం దురభిప్రాయ పడవద్దని విజ్ఞప్తి చేస్తున్నాను. రాజకీయ advantage సంపాదించాలని కాని ఎవరిపైనైనా లేనిపోని నిందలు వేయాలని కాని నా వుద్దేశం కాదు. దాదాపు 3, 4 నెలలుగా ఆ తాలూకాలో administration స్తంభించే పరిస్థితులు ఏవిధంగా ఏర్పడినవో అవి యే విధంగా విషమించినవో వివరిస్తూ సంజీవరెడ్డిగారు Congress నాయకుడుగా మాత్రమే కాక administrator గా చెప్పారు, యీ పై సంఘటనలు గురించి శాంతంగా ఆలోచించాలని నా వుద్దేశము. ఇదివరలో గలాటాలు మాకూమీకూ జరిగినవి, ఇంతరాద్ధాంతం ఎందుకో తెలియదన్నారు. ఇది మేము లేపిన రాజకీయ దుమారం కాదు. దీని వెనుక కుట్రలున్నాయి సంజీవరెడ్డిగారు శాంతంగా వినాలని విజ్ఞప్తి చేస్తున్నాను. దాదాపు వారం రోజుల క్రితంనుండే ఆ గ్రామములో మీటింగు జరుగుతుందని కరపత్రాల ప్రచారం జరుగు తున్నది. అప్పటినుంచీ సుబ్బారెడ్డిగారు మా గ్రామాల్లో ఎలామీటింగు పెడతారో చూస్తాం అని బహిరంగంగా సవాలు చేస్తూవచ్చారు. ఆ రోజు జరిగినదేమిటంటే ప్రజలందరు మీటింగుకు వచ్చారు. మీటింగు జరిగినది అర్ధగంట, నేను నాయకులను పరిచయం చేస్తూ 10, 15 నిముషాలు మాట్లాడాను. తరువాత నాగిరెడ్డిగారు 10, 15 నిముషాలు మాత్రమే మాట్లాడారు. ఆయన వ్యక్తులను నిందించలేదు. తాలూకా సమస్యలు కూడా చర్చించలేదు. అసెంబ్లీలో జరిగిన proceedings ప్రజలకు వివరిస్తూ పన్నులగురించి మాట్లాడారు. గలాటా చేద్దాం అనుకున్న కొంతమంది కొన్ని ప్రశ్నలు వేస్తాం అన్నారు. ఉపన్యాసం అయిన తరువాత జవాబు లిస్తాం ఓపిక పట్టండి అన్నాము. ఆ మురావారు platform పైకి

వచ్చిరాళ్ళురువ్వారు. అప్పుడు హనుమంతరావుగారు గాని నాగిరెడ్డిగారు గాని నేనుగాని ఒక కనుసైగ చేస్తే పరిస్థితులు ఎంతగా విషమించేవో నేను చెప్పనవసరం లేదు. కాని ఆ విధంగా చేయకుండా అక్కడకు వచ్చిన వేలాది ప్రజలకు అడ్డుగా హనుమంతరావు గారు నిలుచుని శాంతికోసం ప్రయత్నించారు. కాబట్టే వారికీ, యిప్పుడు హాస్పిటలులో వున్న తాలూకా నాయకులకు తీవ్రంగా గాయాలు తగిలినవి. $1\frac{1}{2}$ గంటసేపు గలాటా జరిగింది. పోలీసులు యేమిచేస్తున్నారు అని అడుగుతున్నాను.

పోలీసు Station కు $1\frac{1}{2}$ ఫర్లాంగు దూరములో సభ పెట్టినాము. సభలో గలాటా జరిగింది. గలాటా జరుగుచున్నా $1\frac{1}{2}$ ఫర్లాంగు దూరములో వుండే పోలీసులు జోక్యము కల్గించుకోలేదు. పోలీసు ఉద్యోగస్థులగురించి నిందించడము లేదు. యీ నాడు నందికొటుకూరులో పోలీసు Inspector గాని, Magistrate గాని, S. I. గాని, యే గుమాస్తాగాని ధైర్యంగా తన duty సక్రమముగా నిర్వహించలేకపోయే పరిస్థితి ఏర్పడింది. C. I. గారి transfer మామూలుగా administration లో ఒక భాగంగా జరిగిందని సంజీవరెడ్డిగారన్నారు. పూర్తి records తెప్పించుకొని ఇప్పుడు transfer మామూలుగా జరిగిందేమో చూడమని విజ్ఞప్తి చేస్తున్నాను. ఇది మామూలుగా జరిగిన transfer అని ప్రజలు అనుకోవడము లేదు సుబ్బారెడ్డిగారి మనుష్యులు గండ్రగొడ్డళ్ళతోను, పిస్తోళ్ళతోను కాలుస్తూ తనకు సరిలేని పార్టీమీద దాడి చేయడము జరిగింది. C. I. గారు సుబ్బారెడ్డిగారి మనిషిని arrest చేయడము అన్యాయమా? ఆ సందర్భంలో Telegraphic Orders పైన C. I. గారి, S. I. గారి transfer వచ్చింది. మామూలు transfer ఐతే C. I., S. I. గార్లు transfer ఐన నెల రోజుల వరకు ఎందుకు అక్కడ వేరే C. I, ని, S. I. ని వేయలేదు. వెలుగోడు S. I. కి నందికొటుకూరు, C. I., S. I. పనులు చూడమని అప్పగించి నెల రోజులవరకు ఎవరిని వేయకుండ అట్లనే పెట్టడమువల్ల Administration లో మామూలుగా జరిగిన transer కాదు. ఈ విషయాన్ని గురించి సంజీవరెడ్డిగారు విచారించిన, వారికే అర్థమౌతుంది. ఈ సుబ్బారెడ్డిని మంత్రులు కార్లలో కూర్చోబెట్టుకొని తిరగడము చేత, యీ సుబ్బారెడ్డిగారు ఎన్ని అక్రమాలు చేస్తున్నాకూడ ఉద్యోగస్థులు యితనిపై చర్య తీసుకోడానికి భయపడతున్నారు. యీ సుబ్బారెడ్డి తమపైన ఏమైన పై అధికారులకు చెప్పునేమో అనే భయము ఉద్యోగస్థులలో ఏర్పడింది. యీ సుబ్బారెడ్డి ప్రతి ఉద్యోగస్థుని దగ్గరకు వెళ్ళి బెదరించడము జరుగుతుంది. మమ్మలను కాదు. మీకు నమ్మకము గల మీ మిత్రులనే ఉద్యోగస్థుల దగ్గరకు పంపి, తెలిసికొమ్మని విజ్ఞప్తి చేస్తున్నాను. నందికొటుకూరు తాలూకాలో యిప్పుడు అనేక కొట్లాటలు జరుగుతున్నాయి. సుబ్బారెడ్డిగారి చరిత్ర చాలా పెద్దది. ఈ తాలూకాలో ఎన్ని కొట్లాటలలోనూ, ఎన్ని ఖూనీలలోనూ సుబ్బారెడ్డిగారికి సంబంధము వుంది. కొట్లాటలు జరిగినపుడు ఎవరి ఆత్మరక్షణ వారు తప్పకుండా చూచుకుంటారు. ఎన్ని దెబ్బలు తగిలిన దానికి చింతపడడము లేదు. సుబ్బారెడ్డిగారు తన వ్యతిరేకులపై కక్ష సాధించడానికే కాంగ్రెసులో చేరినది. బ్రాహ్మణకొటుకూరులో $1\frac{1}{2}$ నెలక్రితం ఖూనీ జరిగింది. ఆయన పార్టీమీద కేసు పెట్టారు. అటువంటి ఆయనను మంత్రులు కార్లలో ఎక్కించుకొని త్రిప్పుతుంటే, కేసుకు న్యాయంగా విచారించడానికి అధికారులకు ధైర్యము వుండదని చెప్తున్నాను. కమ్యూనిసు పార్టీకి గ్రామ పార్టీలకు సంబంధము లేదు. మీకు నమ్మకమున్న officers ను నందికొటుకూరు గ్రామాలకు పంపి ఎంతమంది జంతువుళ్ళను బాధించినారో ఎంతమంది పిల్లలను భయపెట్టినారో తెలుసుకోవచ్చును. మీకు నమ్మక

మైన M. L. A.'s ను పంపి తెలుసుకొమ్మని విజ్ఞప్తి చేస్తున్నాను. సుబ్బారెడ్డిగారి గత చరిత్ర గనుక పరిశీలిస్తే చాలా విషాదకరమైన ప్రమాదము ఏర్పడే అవకాశముంది. వారివారి రక్షణకొరకు తలకాయలు పగులుకొట్టుకోడానికి సిద్ధముగా వున్నారు. ఎవరికి తలలు పగిలిన చాలా తీవ్రమైన పరిస్థితులకు దారితీస్తుంది. పల్లెటూర్లలోని వ్యవహారాలు చేయిజారిపోయిన తర్వాత సంజీవరెడ్డిగారు విచారిస్తే లాభము వుండదు. నందికొట్కూరు తాలూకాలోని ప్రతి ఉద్యోగస్థునికి, తాను ఉద్యోగస్థుణ్ని కనుక ఉద్యోగ ధర్మము నెరవేర్చవలెననే పరిస్థితి చేయి దాటిపోయింది. తిరిగి ఆ ఉద్యోగస్థులకు నైతిక బలము సంజీవిరెడ్డిగారివ్వాలని మనవి చేస్తున్నాను. ఈ విశ్వాసానికి సంజీవరెడ్డిగారు గ్యారంటీ యివ్వాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా, నిన్నటి నందికొట్కూరు సభలో మన మోటూరి హనుమంతురావుగారికి దెబ్బ తగులడము చాల దురదృష్టము. ఐతే ఇప్పుడు రాజకీయ పార్టీలు ఒక గుణపాఠము నేర్చుకోవాలని మనవి చేస్తున్నాను. సభలో దెబ్బలాడుకోవడము రాళ్ళతో రువ్వుకోవడము లేక అవసరమైతే కత్తులు ఉపయోగించడము 1945 నుండి ప్రారంభమైంది. యీలాగు ప్రారంభము కావడానికి యీ శాసనసభలో వున్నవారు ఎంతమంది బాధ్యులో లోకానికి తెలిసిన విషయమే. సభలలో యితర రాజకీయపార్టీలను వ్యక్తులను నిందించడము విపరీతముగా వ్యాఖ్యానించడము ప్రజలను రెచ్చగొట్టడము గత 8 సంవత్సరాల నుండి దేశములో చాల కలుషితమైన వాతావరణము ఏర్పడింది. యీ సందర్భములో కాంగ్రెస్ వాదులు యీలాంటి వాటికి దిగినవారు లేరా అంటే వారిలోకూడా వున్నారు. ప్రభుత్వము కొంత పక్షపాత బుద్ధితో వ్యవహారము చేస్తున్నది. రాజకీయాల పేరిట యీలాంటి చర్యలకు దోహదమిచ్చేవారిపైన కఠినమైన చర్యలు తీసికొనివుంటే యీ వేళ హనుమంతురావు గారికి దెబ్బ తగిలివుండేది కాదు. కాబట్టి ఇకముందైనా రాజకీయ పార్టీలు జాగ్రత్తగా నడుచుకోవాలి. ఆంధ్రలో సభలు పెట్టి, ఉపన్యాసాలు చేస్తూవుంటే ఏ విధంగా రౌడీ మూకలు ప్రశ్నలు వేస్తే, సభలను చెదరగొట్టుతూ వున్నది యిప్పుడు బాగా వెల్లడైంది. కమ్యూనిష్టుపార్టీ గ్రామాలలో సభలుపెట్టి తమ రాజకీయ సిద్ధాంతాలను ప్రజలకు చెప్పి పని చేయడము ఎవరికి అభ్యంతరములేదు. కాని మామూలు విషయాలను విచిత్రంగా చిత్రించి యితరులను నిందించి ప్రజలను రెచ్చగొట్టుచూ రాజకీయ ప్రాబల్యము సంపాదించుకుంటూన్నామని అనుకొంటూ వుంటే యీలాంటి పరిస్థితులు వస్తూ వుంటాయి. తాము కూడ చేయి జేసుకొని వుంటే ఇంతకంటె ఎక్కువ ప్రమాదము జరిగివుండేదన్నారు. దీనినిబట్టి చూస్తే వారుకూడ కొంత రౌడీ ముఠాను అక్కడ పెట్టారన్నమాట. వాండ్లు చేయిచేసుకోజాలని పరిస్థితిలో వున్నందువల్ల వాండ్లను వెనుకకు తగ్గమని చెప్పారన్నమాట. 150 గజాల దూరములో వున్న పోలీసులు కల్పించుకోలేదన్నారు. బాపట్లతాలూకాలో ఒకచోట నేను వుపన్యాసం చెప్పుతుంటే కమ్యూనిస్టులు నాచుట్టూముట్టి తిట్టారు, కొట్టారు - నానా గోలా చేశారు. అక్కడికి 15 గజాల దూరములో పోలీసు Station వున్నది. కాని వారు ఎవ్వరు కల్పించుకోలేదు. చూస్తూ వూరుకున్నారు. నాకు కొంత దారి యిప్పించమని వారిని కోరాను. అప్పుడు పోలీసులువచ్చి నాకు దారి కల్పించారు. ఇటువంటప్పుడు మనం సాధ్యమైనంతవరకు, మన ప్రవర్తనను చక్కచేసుకోవటం అవసరం. ఇలాంటివి జరగకుండ వుండాలంటే ప్రివెన్‌టివ్ డిటెన్షన్ ఒక్కటే మార్గం. ఈ మధ్యన తెనాలిలో

పట్టపగలు నడిబజారులో - బ్రహ్మాండమైన హత్య జరిగింది. దానిని గురించి పోలీసులు ఇంతవరకు ఏమీ చేయలేదు. దేశం మొత్తంమీద ఇటువంటి అరాచక చర్యలు జరుగుతున్నాయి. కాబట్టి ప్రభుత్వం యిట్టి అరాచక చర్యలను అరికట్టవలసిన అవుసరం వున్నది. ప్రజలను రెచ్చగొట్టే విధానమును మార్చుకొని క్రమమైన పద్ధతులను అలవర్చుకోవాలని కమ్యూనిష్టులను కోరుతున్నాను.

Sri T. NAGI REDDI.— ఈ సంఘటన గురించి ఇక్కడ నేను మాట్లాడుతున్నానంటే, ఇది కమ్యూనిష్టు పార్టీకే ప్రత్యేకంగా, జరిగినటువంటి సంఘటనగా, మాట్లాడుతున్నానన్న విషయం ప్రధానంగాదు. కొన్ని కొన్ని పరిస్థితులు కొన్నికొన్ని ఫలితాలకు దారితీస్తూ వుంటాయి. ఆ పరిస్థితులను గురించి, మనం ఎన్నో సారులు ఆలోచిస్తూ వుంటాము. ఆ పరిస్థితులను చక్కపెట్టడానికి మనం ప్రయత్నం చేస్తూ వుంటాము. ఆ పరిస్థితులు ఏ విధమైన ప్రమాదాలకు దారితీస్తాయి అనే, ఆలోచన లేకపోయినట్లయితే యీలాంటి సంఘటన జరగటానికి అవకాశాలు వుంటాయి. నిన్న జరిగిన మీటింగు సందర్భంలో ఆ విషయాన్ని గురించి ఉదయం మాట్లాడుతున్న సమయంలో దురదృష్టవశాత్తు శ్రీ సంజీవరెడ్డిగారు "అటువంటి దేమో జరిగి వుండవచ్చునని ఊహించారో, విన్నారో, నాకు తెలియదు. ఏదో ఒక provocation లేకపోతే, ఇది జరుగుతుందా?" అని, అన్నారు. కమ్యూనిస్టు పార్టీకి సంబంధించిన provocation లేదంటే విశేషంగా నమ్మరు. నమ్మకపోయినా నాకు వచ్చిన నష్టములేదు. వాస్తవంఅని అనుకున్నదానిని విశేషంగా, జరిగింది జరిగినట్లుగా చెప్పడానికి మేము ఎప్పుడూ సంకోచించమనే సంగతి ప్రభుత్వానికి తెలుసును. తప్పులుచేశాం. ఎన్నో తొందరపాటులుచేశాం, ఐతే తప్పించుకుపోయే పని కమ్యూనిష్టుపార్టీకిలేదు. నిన్న జరిగింది ఏమిటి? ఏ సమయంలో ఇటువంటిది జరిగింది అన్న విషయం, ఆలోచించాలి; అక్కడకు వచ్చిన తరువాత కొద్దిగా అలజడి చెవిని పడిన తరువాత శాంతముగా, జాగ్రత్తగా, మీటింగును జరిపించుకొని పోదామనే వుద్దేశ్యంతో ఇతరులు వేలుబెట్టి చూపించడానికి వీలులేకుండా ప్రత్యేకించి, దెబ్బలు తగిలిన తరువాతగూడ, హనుమంతరావుగారు నేనూ, అక్కడ మూగిన ప్రజలమధ్యకువెళ్ళి, వారు ఏమాత్రం, రెచ్చిపోకుండా మైక్ పని చేసినంతవరకూ దానిద్వారాను తరువాత మైక్ నిలిచిపోయినాగూడ గొంతువున్నంతవరకు పెద్దగాను కేకలువేస్తూ శాంతిపర్చటానికి ప్రయత్నించామనే సంగతి వారు, అంగీకరించినా, అంగీకరించకపోయినా, మాకు విచారంలేదు. మేము అల్లరిని ఆపుచేయటానికి ప్రయత్నంచేశాం. Provocation ఏదో, [illegible] నేతప్ప ఇంత అలజడి జరిగియుండదు. వాస్తవం, వాస్తవంగానే పరిగణింప [illegible] అవాస్తవంగాకాదు. రాజకీయపార్టీలలో నేనూ చాలా సంవత్సరముల [illegible] వుంటున్నాను. మొట్టమొదట కాంగ్రెస్‌లో వున్నప్పుడు సంజీవరెడ్డిగారు, నేను, బళ్ళారిలో మీటింగు చేస్తున్నప్పుడు రాళ్ళుపడ్డసంగతి వాళ్ళకు తెలియదా? అక్కడ [illegible] వారిపన్న [illegible] పోతున్నవనే సందర్భంలో ప్రజలు అడ్డుపెట్టడం జరిగిందన్న సంగతి వారికి తెలుసును. వారు చూచారు. అనుభవించారు గూడ. నిన్న జరిగింది ఏమిటి అన్నదే ప్రధానమైనది. మీటింగు స్థలమునకు ఎడమప్రక్కన కొంతమంది [illegible]. ఆ ప్రక్కనే స్త్రీలువున్నారు. స్త్రీల ప్రక్కనే వీరు జేరారు. మీటింగ్ [illegible] వెళ్ళేవారికి అడ్డము, ప్రక్కకు వెళ్ళమని అక్కడ వున్నవారు చెప్పారు. వెళ్ళలేదు. వుల్లారెడ్డిగారి ఉపన్యాసం అయిన తరువాత, నా వుపన్యాసం ప్రారంభించాను. ఇంతలో ప్రశ్నలు కాగితాలు పంపుతూవుంటే, వాటికి, సమాధానాలు

చెప్పుతాం తప్పక చెప్పుతాం, అని అన్నాం. అక్కడికి, వారికి ఏమాత్రం అవకాశం, చేజిక్కలేదు. అంతలో మూడు ప్రాంతాలనుండి కేకలు వినబడ్డాయి. అప్పటికి నా వుపన్యాసం, ప్రారంభించి 10 నిముషాలు అయిందో లేదో, గోలబైలుదేరింది. ఇది సంజీవరెడ్డిగారి దృష్టికి తెస్తే, వారు అంగీకరిస్తారని, నా వుద్దేశ్యం కాదు. మేము మీటింగులో కూర్చునే వున్నాం. వారు వినవలెనని చెప్పి వారు అడిగిన ప్రశ్నలకు మేము జవాబులు యిస్తామని చెప్పిన హామీలు గూడ, పనిచేయలేదు. ఏ గోలలు జరిగినా, ఒకొక్కక్కరు చెప్పరు. వాటిని ప్రపంచము, చాటిచెప్పిన తరువాత, అందరికీ తెలుస్తుంది. ఎన్ని గ్రామాలలోనో నా మీటింగులో రాళ్ళుపడిన సంగతి నాకు తెలుసును. కార్వేటి నగరంలో నా మీటింగ్ జరగకుండా చేసిన సంగతి నాకు తెలుసును. నా మీటింగు జరుగుతుంటే, డప్పులు వాయించి. అల్లరిచేశారు. ఆ సందర్భంలో, పోలీసులు ఎందుకు చర్యతీసుకోలేదో గూడ తెలుసును. కార్వేటి నగరం, ప్రజలకు తెలుసును. దానిని దీనికి పోల్చి చెప్ప దలచుకోలేద. ఇంతకూ, అక్కడ జరిగింది ఏమిటీ ? ఒక వ్యక్తి అక్కడకువచ్చి, అక్కడవుండి ఇదిఅంతా జరిపించి వెళ్ళిపోయిన సంఘటన ఒకసారి దృష్టికి తెస్తున్నాం. నాకు పోలీసు సహాయం కావలసిన అవుసరం లేదు. దెబ్బలు తింటే నాకు వచ్చిన అవమానం, ఏమీ లేదు. నా జిల్లాలోనే ఒక గ్రామములో కారులో వెళ్ళుతుంటే, క్రిందకులాగ బడ్డాననే సంగతి, నాకు తెలుసును. అవమానం పడ్డానా ? ఒక వ్యక్తియొక్క కార్యక్రమమును బట్టిన్నీ ఆతను చేస్తున్న నీతి అవినీతులబట్టిన్ని, గౌరవం అగౌరవం అనేగి ఏర్పడుతుంది.

నేను ప్రభుత్వానికి మనవి చేయదలచుకొన్నది ఒకటి. ఎక్కడైనా ఒకచోట ఒక సంఘటన జరిగి అందుకు కమ్యూనిస్టులు కారణమని తెలిసినంతమాత్రానే వారిపైన ప్రభుత్వము బ్రహ్మాండమైన చర్య తీసుకొంటుంది. ఉదాహరణకు నర్సాపురంలో జరిగిన సంఘటనకు, కమ్యూనిస్టులు ఏ మాత్రం బాధ్యులు కారు. మాకు అది సంబంధంలేదని చెప్పినా కరపత్రాలద్వారా ప్రజలకు, ప్రభుత్వానికి తెలియ జేసినా ఒప్పుకోక కమ్యూనిస్టు పార్టీలో ఉన్న వారందరిమీద దాడిచేసి జిల్లాలోని కమ్యూనిస్టులందరిని అరెస్టుచేసి వారిమీద బ్రహ్మాండమైన కేసు పెట్టారు. వీరిపట్ల ప్రభుత్వ దృక్పథము ఈ విధముగా ఉండగా, ఇప్పుడు నందికొట్కూరులో జరిగిన సంఘటనకు అక్కడ ఉన్నటువంటి ఒక ప్రధానమైన కాంగ్రెస్ వాది, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యుడు కాంగ్రెస్ నాయకులలో ముఖ్యుడు మంత్రుల పర్యటనలలో ఎప్పుడు వారితో కలిసి తిరుగుతూ యుండేటటువంటి · ఒక వ్యక్తి కారణమై యుండగా ఆతనిమీద తీసుకొన్నటువంటి చర్య ఏమిటి అని అడుగుచున్నాను. ఈ విషయములో నాగిరెడ్డిగారు చెప్పేది అబద్ధమని చెప్పుతారేమో నేను చెప్పునది అబద్ధమని చెప్పగలరేమో గాని ప్రజలు చెప్పేదికూడ అబద్ధమనగలరా? ప్రజాభిప్రాయాన్ని కాదనగలరా అని అడుగుచున్నాను. నిజము ఈనాడు తెలుసుకోలేక పోయినా, రేపైనా తెలియకుండా పోతుందా? కాంగ్రెసు పార్టీయొక్క గౌరవ ప్రతిపత్తులను నిలబెట్టాలనే ఉద్దేశ్యముతో జరిగినటువంటిదాన్ని మరుగుపరచలేరు. ప్రభుత్వ దృక్పథం ఈ విధంగా ఉన్నదని ఈ సంఘటన రుజువుచేస్తున్నది. లేకపోయినట్లైన ఈ సంఘటన ఈ విధంగా జరుగుటకు కారణమేమి ? ఇది ఏవిధంగా జరిగింది? దీనికి కారకులెవరు? దీనిపైన ప్రభుత్వము ఏమిచర్యతీసుకొనింది? తీసుకోక పోతే ఎందుకు గాను తీసుకోలేదని అడుగుతున్నాను. లేకున్న మేము స్వాతంత్రం మీటింగులో అడ్రెస్ చేసేటటువంటి సమయములో ఆకస్మాత్తుగా, నిష్కారణముగా ఇటువంటి సంఘటన

ఎందుకు కలిగింది? దీనికంతకి కారణం ఆ కాంగ్రెసువాది సుబ్బారెడ్డి అనే అతను అని స్పష్టంగా తెలుస్తుంది అయినప్పుడు ఈ విషయములో ప్రభుత్వము ఆ వ్యక్తి మీద ఏమి చర్య తీసుకొనిందని అడుగుచున్నాను. అయితే ఈ నాడు జరిగినటువంటి సంఘటన పెద్దది కాదు. చిన్నదే. రి హనుమంతరావుగారికి ఒక చిన్న దెబ్బ తగిలింది. రాజకీయములో ప్రవేశించిన తరువాత ఇటువంటివి, ఇంకా తీవ్రమైనటువంటివి అనేక దెబ్బలు తిన్నామని, సంజీవరెడ్డిగారన్నారు. నిజమే ఈనాడు జరిగిన సంఘటన చిన్నదే కావచ్చు. హనుమంతరావుకు తగిలింది చిన్న దెబ్బే కావచ్చు. మేము మాత్రము దెబ్బలకు వెరుస్తామా! దెబ్బలకే వెరచేటట్టుంటే ఈ పార్టీలో ప్రవేశించుటకే వీలులేదు. కాని అంతమాత్రాన ప్రభుత్వము తన బాధ్యతను, కర్తవ్యమును నిర్వహించపనిలేదా? తరువాత కమ్యూనిస్టులకు ఒక కార్యక్రమంగాని, ఒక సక్రమ విధానం గాని లేదని, ఎప్పుడు దౌర్జన్యమునకే పూనుకొంటుందనీ దౌర్జన్యం తప్ప వారికింకొక పని లేదని విమర్శిస్తూ యుంటారు. ఈ సందర్భములో వారికి ఒక విషయం చెప్పుతున్నాను. ఏ పిల్లి అయినాసరే ఇంటిలో ఎంతతిన బెట్టినా తన్ను తాను కాపాడుకోడానికి అదికూడ తిరుగుబాటు చేస్తుందనే విషయాన్ని మీరు కూడ జ్ఞప్తి చేసుకోవాలని కోరుచున్నాను. ఇటువంటి సందర్భాలలో ఓపిక ఉండాలి అని అంటున్నాను. ఓపిక ఉండబట్టే ఇంతవరకు ప్రజలముందు రాగలిగాము. మాకు ఓపిక చాలా ఉన్నది. మేము ఓపికతోనే పనిచేస్తున్నాము. ఇది ప్రజలకు కూడ తెలిసిన విషయమే. ఇది ప్రత్యక్షంగా 10 ఏళ్ళనుంచి నిరూపించాము. కాని ఈ ఓపికకు కూడ ఒక limit ఉంటుందనే విషయాన్ని జ్ఞాపకముంచుకోవాలని మనవి చేస్తున్నాను. ఓపిక ఉండవలెనని చెప్పి ఇటువంటి సంఘటనలకు ప్రోత్సాహ మివ్వ వచ్చునా? కమ్యూనిస్టులు ఏ కొద్ది తప్పుచేసినా వారిలో ఏ కొద్ది లోపముందని తెలిసినా, అది బ్రహ్మాండం చేసి గొప్పగా చర్య తీసుకోవడం జరుగుతుంది గాని ప్రభుత్వ పక్షమువారు ఏమిచేసినా పరిగణింప బడడంలేదు. పైగా కమ్యూనిస్టులకు హృదయం లేదని చెప్పుతారు. ఇదేనా మీ పద్ధతి అని అడుగుతున్నాను. హృదయ మున్నవారెవరైనా ఇటువంటి సంఘటనకు పూనుకో గలరా అని ప్రశ్నిస్తున్నాను. కనుక ఇటువంటి పార్టీ దృక్పథంతో గాకుండా మీరు నిజంగా ప్రజాస్వామిక ప్రభుత్వమని అనుపించుకో దలచినట్లైతే ఇటువంటి సంఘటనలకు తావివ్వకుండా ఇటువంటి సంఘటనలు జరిగి నప్పుడు వాటిని జాగ్రత్తగా విచారించి తగినటువంటి చర్య తీసుకొని ప్రజలలో శాంతిభద్రతలను కాపాడవలెనని కోరుచున్నాను. లేకపోయినట్లైతే ఇప్పుడు జరిగినటువంటి సంఘటనలు మీముందు పెట్టికూడ నిరుపయోగమవుతుందని ప్రజలలో శాంతిభద్రతలు ఉండవని మనవి చేస్తున్నాను. కనుక ఇటువంటి దానికి అవకాశమివ్వకుండా ప్రభుత్వము తగుచర్య తీసుకోవలసిందని ఆవిధంగా హామి ఇవ్వవలెనని కోరుచున్నాను.

The Hon. Sri. N. SANJEEVA REDDI : అధ్యక్షా, ఈసంఘటన జరిగిందని ఉదయం ఇక్కడికి వచ్చినతరువాత విన్నాను. తరువాత విషయాలన్నీ కూడ ఉద్యోగస్తులద్వారా సేకరించాను. నేను విన్నదానికి ఇక్కడ నాగిరెడ్డిగారు ఇచ్చిన version కు ఏమి భేదము లేదని అంగీకరిస్తున్నాను. కాని ఈ పద్ధతి ఒక ఆలవాటు క్రింద, ఒక అంటురోగము మాదిరిగా దేశములో 8 ఏళ్ళుగా వస్తూందని కోటయ్యగారు చెప్పినదానితోకూడ నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. ఇటువంటి పని ఎవరు చేసినప్పటికినీ, దానిని హర్షించకపోవడమే కాదు. ఈ పద్ధతి మంచిది కాదని మొదటనుంచి చెప్పుతున్నాను. ఈ పద్ధతివల్ల, ఏ పార్టీగాని, ఏ వ్యక్తిగాని బలపడర్రు అని నాకు బాగా తెలుసును. ఒక నిస్సహాయ

స్థితిలో ఉన్నప్పుడుగాని, మనస్సు ఒక poisonous పంథాలో పోతు ఉన్నప్పుడు గాని, కొందరు వ్యక్తులు ఇటువంటి పద్ధతికి పూనుకొంటారు. దానివల్ల ఆ వ్యక్తులు బలహీనపడడమే కాకుండా, తాము ఏ పార్టీకి చెంది ఉంటే ఆ పార్టీని బలహీనపరుస్తారుకూడా. ఈ విషయములో, ఇప్పుడే కాదు నాకు ఈవిశ్వాసము చాలరోజులనుంచీ ఉన్నది ఒక్కొక్క పర్యాయము, దుర్మార్గము బలపడుతున్నట్లును, ఈ పంథాలో opposition ను లొంగతీసుకొనేటటును కన్పడుతుంది. కాని అది తాత్కాలికమే. ఆవిధంగా చాలా కాలము చేయలేరు. ఇప్పుడు జరిగినటువంటిది చాలా చిన్న విషయము. నా జీవితములో చూచినటువంటి సంఘటనలు చాలా ఉన్నాయి.

1945 లో, అప్పుడు కాంగ్రెసు వారంతా, పంతులుగారు సహా జైళ్ళలో ఉండేవారు. ఇతరులకంటె మూడు రోజులు ముందుగా మమ్ము వదలివేశారు. వదలివేశిన తరువాత, చల్లపల్లి గ్రామంలో ఈ సంఘటన జరిగిన సమయంలోనే అంటే రాత్రి 9 గంటలకు, నేను, గొట్టిపాటి బ్రహ్మయ్య, చంద్రమౌళి వగైరా అంతా ఉపన్యాసము ఇస్తున్నాము. కాంగ్రెసు ఆనాడు ban చేయబడింది. కాంగ్రెసు అని చెప్పుకోడానికి కూడా వీలులేదు. ప్రజలు కాంగ్రెసు అంటే భయపడుతూ పోలీసుకు అండగా ఉండే రోజులవి. అటువంటి రోజులలో బహిరంగంగా సభపెట్టాము. ఇప్పుడు ఇక్కడ జరిగినటువంటిదానిలో, ఏవో రాళ్ళు విసరగా కొంచెము దెబ్బలు తగిలినాయని అన్నారు. కాని అప్పుడు ఒకరిని కట్టెలతో కొట్టి రక్తము గారుతూ ఉంటే, అతనిని ఆ ఊరిలో ఆస్పత్రికి తీసుకుపోవాలని, నేను, బ్రహ్మయ్యగారు, చంద్రమౌళిగారు request చేశాము. కాని, మా request ను వినకుండా, అక్కడే మమ్మందరిని ఆపి అరగంట సేపు మాతో ఉపన్యాసము వినిపించిన రోజులు కూడా చూచాము. నేను మొదటినుంచి Home Minister గా ఉండలేదు. అలాటి సంఘటనలు కూడ అనుభవించాను.

ఇంకను ఆ రోజులు చాలా ఉద్రేకమైన రోజులు. కాంగ్రెసు అంటే, అధికారులు కోపోద్రేకు లయ్యేవారు. ఎక్కడ ఏది జరిగినా, కాంగ్రెసు వారు చేస్తున్నారనే అనేవారు. కాంగ్రెసువాడు అని చెప్పుకుంటే దెబ్బలు తినవలసియుండేది. దెబ్బలు కొట్టారు, తిన్నాము కూడా. కాని ఆ పద్ధతి మంచిదికాదని ఆ నాడు నేను చెప్పాను. కాంగ్రెసు ప్రతినిధినై ఆ రకంగా చేస్తే, నేను కాంగ్రెసువాణ్ణి అని చెప్పుకోటానికి సిగ్గుపడుతున్నాను. అంతా కాంగ్రెసు బలంకాదని నేను బహిరంగంగా చెబుతున్నాను. నేను ఎక్కడికైనా మీటింగుకు వెళ్ళితే, నా యొక్క పలుకుబడి వుంటే దాని విషయము చెప్పుకోదలచుకున్నాను. శ్రీ పుల్లారెడ్డిగారు చెప్పినదాన్నిబట్టి నేను వీరిని ఒక విషయము అడుగుతున్నాను. ప్రతిపక్ష సభ్యులైనప్పటికిని వారు ఒక ఉద్రేకపూరితమైన ఉపన్యాసము యిస్తున్నప్పుడు ప్రజలుగూడా ప్రశ్నలు వేయటానికి ప్రారంభిస్తే, అది అల్లరి క్రిందకే వస్తుంది. ఇది ఎట్లా వుంటుందంటే, రెండు చేతులు కలిస్తేనే చప్పుడు అవుతుంది. ప్రజలు వుద్రేకరూపము దాల్చితే, మనము మీటింగులలో కొంచెము ఉద్రేకమును తగ్గేటట్లుగా మాట్లాడితే, అల్లరి వుండదు. చప్పుడు కన్పించదు. ప్రతి గ్రామములోనూ ఎన్నో పార్టీలు వుంటవి. మనము ప్రజలకు పరిస్థితులు తెలియజేయటానికి

వెళ్ళితే, అవి ఒక పార్టీకి నచ్చుతాయి, యింకొక పార్టీకి నచ్చవు. అయినను మనము గ్రామాలలో ఒకే పార్టీని ప్రోత్సహించటానికి వెళ్ళుతామని చెప్పే మాట నేను నమ్మను. గ్రామాలలో యీలాంటి పార్టీ విభేధాలు వచ్చి తగాదాలు వస్తే అక్కడినుంచి మనము తప్పుకొని బైటికి రావాలి. నేను అటువంటి చోటకు మీటింగుకు వెళ్ళితే, ప్రజలలో పార్టీ తగాదాలు, విభేధాలు వచ్చి, అల్లరి, గల్లంతు అయ్యేటట్లుగా వుంటే, దాన్ని ముందుగానే గ్రహించుకొని నేను తప్పుకొని బైటికి వచ్చేవాడిని. అదే విధంగా మీరుకూడా బైటికి వస్తే మంచిది. ఈలాంటి తగాదాలు సాధారణముగా వుంటూనే వుంటవి. మనం వ్యక్తిగతంగా అటువంటిచోట గౌరవము నిలబెట్టుకోవాలంటే, యీ రాజకీయాలను ఆ పార్టీలకు అతీతంగా వుంచాలి. మీటింగులలో యీ నాడు జరిగే వుద్రేకాలనుబట్టి నేను చెబుతున్నాను. అవి ఎట్లా వున్నవి అంటే, కమ్యూనిస్టు పార్టీవారు వెళ్ళి కాంగ్రెసు వాళ్ళకు ప్రజలు బుద్ధిచెప్పారు, అని చెప్పడం మంచిదికాదు. అది కాంగ్రెసు పార్టీని ఉద్రేకపరచినట్లే అవుతుంది. సంజీవరెడ్డిగారిని కొట్టినవాడు, కొట్టింది ప్రజానీకమేనని చెప్పడం, కమ్యూనిష్టులను కొట్టినవాడు, వారిని రౌడీలు కొట్టారు అని చెప్పడం, ఇటువంటి ప్రచారం మంచిదికాదు. పట్టాభి రామారావు గారు వెళ్ళి, ఆ విధంగా అనకూడదు, అది తప్పు అని చెబితే, ప్రజానీకం బుద్ధి చెప్పింది, అని చెప్పడం మంచిదికాదు. ప్రతిదానికి ప్రజానీకం బుద్ధి చెప్పింది, రౌడీమూకలు కొట్టారు అని చెప్పడం మంచిదికాదు. ఎవరైన మీటింగు పరిమీద వెళ్ళితే, అప్పుడు అక్కడ గల్లంతు అయితే, అది రౌడీమూకలు చేశారు అని చెప్పేది ప్రతి దానికి రౌడీమూక, రౌడీమూక అనిచెబితే, దానికి విలువ తగ్గుతుంది. మీటింగులలో రాళ్ళు రువ్వితే, ప్రజానీకం బుద్ధిచెప్పింది అని ప్రచారం చేయడం న్యాయంకాదు. అక్కడ మీటింగుకు వచ్చి కూర్చున్నవారినందరిని రౌడీమూకలంటే, ఏమైనా అల్లరి జరిగితే, అదంతా అక్కడకి వచ్చినవాళ్ళందరు చేశారంటే, నేను నమ్మను. అందలో కొందరు మంచివారు వుండవచ్చు, చెడ్డ వారు వుండవచ్చు నందికొట్కూరులో అల్లరి జరిగింది అనే మాట నేను accept చేస్తున్నాను. ఇప్పడు పుల్లారెడ్డిగారు చెప్పినదాంట్లో, నాకు వచ్చిన రిపోర్టులోను variation వున్నదని నేను అనను. అక్కడ జరిగిందంతా పుల్లారెడ్డిగారు చెప్పారు. అయినప్పటికి explosive material వుండేచోట మనము కొంచెము జాగ్రత్తగా వుంటె మంచిది. Explosive material వుండే చోట ఫలానాచోటికి మీరు రండి, మనము ఒకచోటుకు నిప్పుపెట్టుదామని కూడ పలుకుకొని, arrangement చేసుకోవటం ప్రజలకు సులభమే. అలాంటి చోట పుల్లారెడ్డిగారు ఉన్నారు నిప్పుపెట్టుదాముదండని చెప్పటానికి సిద్ధంగానే వుంటాయి. మనము వెళ్ళినచోట మన గౌరవము కాపాడుకోకపోతే, మనమే సిగ్గుపడి రావలసి వుంటుంది. నందికొట్కూరులో మద్దూరు సుబ్బారెడ్డిగారే యీ ఉదంతము చేయించారని చెప్పడం మనం గర్హించాలి. మనము మీటింగు అలో ప్రజానీకం బుద్ధిచెప్పింది, రౌడీమూకలు గల్లంతు చేశారని చెప్పడం మాని వేయాలి. ఆ విధంగా చెప్పడం న్యాయంకాదు. అటువంటి ప్రచారం తగ్గించాలి. నేను కర్నూలులోను, అనంతపురంలోను ఎన్నోసార్లు ఉపన్యాసాలు చేశాను. Towns లో కన్నా villages లో కొంచెము tension జాస్తిగా వుంటుంది. అటువంటి tension వున్నప్పుడు మనం కొంచెము తగ్గి మాట్లాడాలి. ప్రజలను

ఉద్రేకపరిస్తే ప్రయోజన మేమీ వుండదు. మీరు వుపన్యాసం చేసేటప్పుడు కొన్ని ప్రశ్నలు ప్రజలనుండి రావచ్చు. వాటికి జవాబు తరువాత చెబుతాము అని చెబితే, కాదు ఇప్పుడే చెప్పాలి అని ప్రజలు ఉద్రేకపడవచ్చు. అలాంటప్పుడు యిలాంటి ఘర్షణలు జరుగకుండా మనము మనఉపన్యాసాలను కొంచెము control చేసుకోవాలి, గాని ప్రజలను మరింత ఉద్రేకపరిస్తే ప్రయోజనము లేదు. మన మాట సాగనప్పుడు మనము అక్కడినుంచి తప్పుకొని యివతలకు రావడమేమంచిది. నేను నందికొట్కూరు వివరాలు తెప్పించాను. Sub Inspector రిపోర్టుకూడా యిప్పుడే వచ్చింది.

Sri T. LAKSHMINARAYANA REDDI.—Sub Inspector report లో ఏమి వుందో చదువుతారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI.— నేను పోలీసు శాఖ మంత్రిగా మాట్లాడుచున్నాను. నేను ప్రతిపక్షమున వున్న సభ్యులకు Sub Inspector Report ను నేను మాత్రము చదువను. అటువంటి ప్రశ్న నన్ను అడిగితే నేను దానికి సమాధానంకూడా యివ్వను అని అంటున్నాను. పోలీసువారు ఆ టైములో ఏ విధమైన సహాయము చేయలేదని పుల్లారెడ్డిగారు అంటున్నారు. అదికాదు. వారు నిజంగా వచ్చారో లేదో నేను విచారిస్తాను.

A MEMBER.—ఉదంతం అంతా జరిగి, దెబ్బలు తగిలినతరువాత కొంచెముసేపటికి పోలీసులు వచ్చారు.

The Hon. Sri N. SANJEEVA REDDI.—తరువాతనేవచ్చివుంటారు. గాంధీ గారిని చంపినప్పుడు కూడా పోలీసులు అక్కడ హాజరులోలేరు. అప్పుడు కూడా పోలీసులు తరువాతనేవచ్చారు. గాంధీగారిని చంపుతారని ఎవరైనాకలకన్నారా? ముందుగా తెలిస్తే, అక్కడ పోలీసులు హాజరులో ఎందుకు వుండి వుండరు? వారికి తెలియక పోబట్టే. తరువాత తెలిసింది కాబట్టి, తరువాత వచ్చి చంపిన వాడిని పట్టుకొన్నారు. అదేవిధంగా, అల్లరి అవుతుంది. మెంబర్లను పట్టుకొని కొట్టుతారని పోలీసువారికి తెలియకపోవచ్చు. కొట్టారని తెలిసిన తరువాతనే వారు వచ్చివుంటారు. రౌడీ మూకలు అల్లరిచేయకుండా ఎట్లు చేస్తారు. అల్లరి జరిగితే అప్పుడు దాన్ని తగ్గించటానికి ప్రయత్నిస్తారు. వారు చేయగలిగిందంతా యేమిటంటే, యీ విధంగా జరిగిందని రిపోర్టు వ్రాస్తారు. అల్లరి జరిగిందని తెలిసిన తరువాత పోలీసులువచ్చి వారందరిని యిళ్ళకు పంపివేశారు. తరువాత ఏ అల్లరి జరుగలేదు. రౌడీ మూకలను ఒక్కరినే పొమ్మని చెప్పలేదు. వూళ్ళోవారిని కూడా అక్కడినుంచి పొమ్మని చెప్పారు. ఇప్పుడు జరిగిందేమో, జరిగిపోయింది. ఈ విషయము నేను విచారిస్తాను. ఎవరు యీ విషయము హర్షించినమా, నేను మాత్రం గర్హిస్తున్నాను. ఎవరు మీటింగులు పెట్టినను, నాకు మాత్రం రిపోర్టులు వస్తూనే వున్నవి. అన్ని సంగతులు నేను వింటునే వున్నాను. రాజకీయాలలో, సభ్యులలో విభేధాలు వుంటే, అవన్ని యిక్కడ-మనము మాట్లాడుకోవచ్చు. తప్పేమీలేదు. గ్రామాలకు వెళ్ళి మీటింగులలో మనము ఉద్రేకంగా మాట్లాడే టప్పుడు కూడా మన ధోరణిని కొంచెము తగ్గించి మాట్లాడితే ఏ ప్రమాదము వుండదని నా అభిప్రాయము. దీని రిపోర్టు వచ్చింది. చూచాను. కమ్యూనిస్టు అంటే అక్కడికి అందరు చేరి వుంటారు. ఉద్రేక శక్తులు మీటింగులో వున్నప్పుడు

మనము ఆ పరిస్థితిని గుర్తించి control చేసుకొని వుండవలసిందని మనవిచేస్తు న్నాను. కాబట్టి మిమ్ములను కోరేది యేమిటంటే, Let there be some peace in the State. Let us begin anew. మీ రందరు కూడా ఆ విధంగా చేయాలని అంటున్నాను. ఈ ఉద్రేక పరిస్థితులను మార్పుచేసి శాంతి పరిస్థితులు కల్గించాలని మనవి చేస్తున్నాను. రాజకీయ దౌర్జన్యాలు ఎక్కడో ఒకచోట జరుగు తూనే వున్నవి. పోలీసులు వచ్చి యేమీ చేయలేదని అంటున్నారు. జరిగివుంటే, పోలీసులు యేమీ చేయలేదు అని చెప్పేదానికన్నా, విషమ పరిస్థితులు కల్పించ కుండా వుంటేనే మంచిది. Higher level లో ఎవరైనాసరే మాట్లాడుకో వచ్చును. కల్లూరు సుబ్బారావుగారు కూడా కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నారని అంటున్నారు. ప్రజలు కాంగ్రెసువారికి బుద్ధిచెప్పారు అని చెప్పటం తగ్గించాలంటున్నాను. మనము ప్రజలను ఉద్రేకపరుస్తూ వుపన్యాసాలు చేస్తే ప్రజలు ఉద్రేకులై అల్లరిచేయడం ప్రారంభించారంటే, అది ప్రభుత్వం తప్పు కాదు. కాబట్టి యిలాంటి ఉద్రేకమును ప్రజలలో రెచ్చగొట్టకుండా, యికమీదట నైననూ రాజకీయ విభేదాలను వదలిపెట్టి, ప్రజలు శాంతియుతంగా యుండే పరిస్థి తులు కల్పించే ఉపన్యాసాలు చేయడం మంచిది. కాని ఉద్రేకపరచడం మంచిది కాదు. అటువంటి పరిస్థితులు కల్పించవద్దని నేను మనవిచేస్తున్నాను.

ఆంజనేయులుగారు Home Minister అయిననాడు కూడా వస్తాయి రిపోర్టులు. ఆనాడు మేముకూడా ఉపన్యాసాలు చేయడం అంటూ వస్తే తప్ప కుండా వస్తాయి. సంజీవరెడ్డి ఈనాడు భోజనం చేశాడు. సంజీవరెడ్డి ఈరోజు భార్యతో మాట్లాడాడు, ఇల్లు కట్టాడని రిపోర్టులు వస్తాయి. రాజకీయాలుంటే ఎక్కడైనా మాట్లాడుకోవచ్చు. (Interruption)

Sri M. HANUMANTHA RAO :—అధ్యక్షా! మీద్వారా శ్రీ సంజీవరెడ్డిగారికి తెలియజేసే దేమంటే, ఇక్కడ మేము చేసిన ఉపన్యాసాలు ఉన్నాయి. వారు చేసినవి ఉన్నాయి. వాటినిపోల్చి చూస్తే దాదాపు చాలా తక్కువ స్థాయిలోనే మా ఉపన్యా సాలు ఉన్నాయని వారికి నేను హామీ ఇవ్వగలను.

The Hon. Sri N. SANJEEVA REDDI :— వారు అంగీకరించరు. ఈనాటి నుంచీ కూడా మానకుంటారా ? అది వారికి చేతకాదు. అలా ఒప్పుకోరు వారు. (Interuption)

Sri T. NAGI REDDI :—వారు చెప్పిన దాన్ని మేము ఖచ్చితంగా ఒప్పు కుంటాము. బడ్జెట్ సమావేశం ఉన్నప్పుడు ప్రభుత్వం ఏ విధంగా ఖర్చు పెడుతున్నదని ప్రభుత్వ ఖర్చులమీద విమర్శిస్తున్నాం కాని వ్యక్తిగతంగా వారిమీద కాదు. వారిని గురించి చిన్నప్పటినుంచీ నాకు తెలుసు. వారిమీద చెప్పడానికి పూనుకోను. ఇది పరి పాలనా విధానానికి సంబంధించినంత వరకు మాత్రమే చెపుతున్నాను. వ్యక్తిగతంగా చెప్పడంలేదు. అంతవరకు నేను హామీ ఇవ్వగలను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:—మీ ఒక్కరి తరఫునే ఇచ్చారా ? పార్టీఅంతటి తరఫున ఇచ్చారా !

Sri K. VARADACHARI;— ఇప్పుడు ప్రశాంతమైన వాతావరణం ఏర్పడింది కాబట్టి ఇప్పుడైనా మహాత్మా గాంధిగారి ఫోటోమీద తెరను తొలగించాలని కోరు తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:—

.........I accept with thanks the offer made by the Leader of the Opposition. We will certainly reciprocate" House Building Societies కీ అప్పులు ఇచ్చాం అని చెప్పారు. సంజీవరెడ్డి అప్పు తీసుకొని ఇల్లు కట్టు కొన్నాడని చెప్పారు. కో-ఆపరేటివ్-సొసైటీలు ఇళ్లు కట్టుకోడానికి దేశములో అందరికీ అప్పులు ఇస్తున్నారు. నాకూ ఇచ్చారు. అది వాళ్లు ధర్మం క్రింద నాకు ఇవ్వలేదు. ఇక నందికొట్కూరులోనే కాదు, ఇక్కడే కాదు, రాష్ట్రం అంతటాకూడా చాలా ప్రశాంత పరిస్థితులు ఏర్పడ్డానికిప్రయత్నంచేస్తే బాగుంటుంది. ఏదో ఒకళ్ళిద్దరు పోలీసుబలంతో ప్రశాంత పరిస్థితులను తీసుకురాలేము. కాబట్టి అలాంటి పరిస్థితులు ఏమైనాఉంటే ప్రభుత్వంతో సహాకరించి, దుర్మార్గులను శిక్షించడానికి ప్రయత్నంచేస్తే ప్రభుత్వానికి బలం వస్తుంది. అలాంటి బలాన్ని ఇవ్వడానికి మీరంతా సహకరిస్తారని ఆశిస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఈ చర్యలకు కారకులయినవారిమీద చర్య తీసుకుంటారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— Investigation జరుగుతుంది.

Sri V. V. KRISHNAMRAJA BAHADUR :— నేను ఈ శాసన సభ్యుల తరఫున వారి గౌరవందృష్ట్యా, నా సోదర సభ్యులు శ్రీ హనుమంతరావుగారు రెండు వర్గాలకు కలిగిన ఉద్రేకాన్ని తగ్గించడానికి వెళ్ళినప్పుడు దైవవశాత్తూ వారికి తగిలిన దెబ్బకు విచారిస్తున్నాను.

Mr. SPEAKER :— The House stands adjourned and will meet again some time in May, probably in the first week.

Sri C. V. K. RAO :— వచ్చే శాసనసభ వాల్తేరులో జరుగుతుందని పేపర్లలో వచ్చింది. దానియొక్క నిజానిజాలు తెలియచేస్తారా ?

The Hon. Sri T. VISWANATHAM :—చాలామంది శాసన సభ్యులు, అన్ని పక్షాలవారూ కూడా వేసవికాలం మూలాన అక్కడ పెట్టుకుంటే బాగుంటుందని కోరారు. అక్కడ యూనివర్శిటీ సెనేట్ హాల్ వుంది. April నెలాఖరుతో examinations అయిపోయి, అది కాళీ అవుతుందని మన ఎడ్యుకేషన్ మినిష్టరుగారు ఫోనులో మాట్లాడగా వైస్ ఛాన్సలర్ చెప్పారు. అందుచేత మీ కందరకూ సమ్మతమైతే అక్కడ పెట్టుకోడానికి వీలౌతుంది. May మొదటి వారంలో పెట్టుకోవచ్చు.

The House then adjourend sine die.

# STATEMENT PLACED ON THE TABLE OF THE HOUSE

(Legislative Assembly unstarred question No. 64, Sri T. Lakshminarayana Reddy, M. L. A.)

Number of private, District Board, and Government High Schools, in Andhra Districts.

| Name of District Ednl. | Number of High Schools | | | |
|---|---|---|---|---|
| | Private. | Dt. Board. | Govt. | Total. |
| Srikakulam | 1 | 33 | 1 | 35 |
| Visakhapatnam | 6 | 12 | 2 | 20 |
| East Godavari | 17 | 44 | 5 | 66 |
| West Godavari | 10 | 44 | 2 | 56 |
| Krishna East | 5 | 31 | 3 | 39 |
| Krishna West | 4 | 44 | — | 48 |
| Guntur North | 17 | 45 | 1 | 63 |
| Guntur South | 17 | 39 | — | 56 |
| Nellore | 11 | 34 | 1 | 46 |
| Chittoor | 7 | 24 | 1 | 32 |
| Kurnool | 8 | 23 | 3 | 34 |
| Cuddapah | 3 | 18 | 1 | 22 |
| Anantapur | 3 | 25 | 2 | 30 |
| | 109 | 416 | 22 | 547 |

## PAPER PLACED ON THE TABLE OF THE HOUSE.

[*Vide* UNSTARRED QUESTION No. 47 BY SRI T. LAKSHMINARAYANA REDDI, M.L.A.]

*Statement showing the extent of panchayat forest taken over by the Forest Department in Anantapur District.*

| *Serial number and Range.* (1) | | *Name of Reserved Forest.* (2) | *Area in Acres.* (3) | *Area. in Sq. miles.* (4) |
|---|---|---|---|---|
| 1 | Bukkapatnam | Somanadepalle | 9781·63 | 15·30 |
| 2 | Do. | Penukonda and Additions. | 4641.74 | 7·25 |
| 3 | Do. | Kekathi | 2470·25 | 3·86 |
| 4 | Do. | Madakasira North | 3472·75 | 5·42 |
| 5 | Do. | Madakasira South | 963·40 | 1·52 |
| 6 | Do. | Gundumala | 5344·00 | 8·35 |
| 7 | Do. | Yerrakonda Part | 7729·35 | 12·07 |
| 8 | Do. | Yerrakonda Extension | 4966·76 | 7·76 |
| 9 | Do. | Ratnagiri | 1127·00 | 1·76 |
| 10 | Do. | Hottepetta North and additions. | 7347·27 | 11·48 |
| 11 | Do. | Sankaragallu, South | 1008·00 | 1·57 |
| 12 | Do. | Neradikonda and additions. | 2162·97 | 3·38 |
| 13 | Do. | Kaligera | 2765·16 | 4·32 |
| | | Total | 53,780·28 | |
| 14 | Madanapalle | Mudupula Juvvi | 1226·00 | 1·92 |
| 15 | Dharmavaram | Ramagiri East | 2047·32 | 3·21 |
| 16 | Do. | Durgam beat | 4562·00 | 7·13 |
| 17 | Do. | Tarimala Part | 9484·56 | 14·83 |
| 18 | Do. | Bhadrampuram and Extensions. | 3707·00 | 5·79 |
| 19 | Do. | Kuderu and Extensions | 11308·80 | 17·67 |
| 20 | Do. | Kondupalle | 4500·00 | 7·02 |
| 21 | Do. | Narasampalle | 1933·00 | 3·02 |
| 22 | Do. | Iyyampalle | 1358·89 | 2·13 |
| 23 | Do. | Jambugumpala | 4950·00 | 7·73 |
| 24 | Do. | Beluguppa | 2945·00 | 4·60 |
| 25 | Do. | Guttur, East - West and Additions. | 7791·62 | 12·19 |
| 26 | Do. | Ramagiri West | 3476·86 | 5·43 |
| 27 | Do. | Budikonda A and B Blocks. | 1275·00 | 1·99 |
| 28 | Do. | Kalyanadrug. South | 996·00 | 1·56 |
| 29 | Do. | Idukallu | 3775·20 | 5·9[illegible] |
| 30 | Do. | Pillalapalle | 1365·00 | 2·13 |
| 31 | Do. | Settur | 4372·74 | 6·83 |

| Serial number and Range. (1) | | Name of Reserved Forest. (2) | Area in Acres. (3) | Area in Sq. miles. (4) |
|---|---|---|---|---|
| 32 | Dharmavaram ... | Khaireu ... | 5322·10 | 8·31 |
| 33 | Do. ... | Kalyanadrug, North... | 467·00 | 0·74 |
| 34 | Do. ... | Marutla ... | 12034·97 | 18·80 |
| 35 | Do. ... | Kanumpalle ... | 1775·11 | 2·77 |
| 36 | Do. ... | Yemmehatti ... | 1815·00 | 2·83 |
| | | Total | 103,337·56 | 161·46 |
| 37 | Kadiri ... | Somarajumala, West... | 1941·57 | 3·03 |
| 38 | Do. ... | Kokkarajukonda ... | 2720·00 | 4·25 |
| 39 | Do. ... | Kadiri ... | 5420·00 | 8·47 |
| 40 | Kadiri. ... | Agraharam and Additions. | 2134·55 | 3·34 |
| 41 | Do. ... | Malakavemulakonda... | 2284·52 | 3·57 |
| 42 | Do. ... | Somarajumala East. | 910·00 | 1·42 |
| 43 | Do. ... | Elavalakonda and Additions. | 1836·99 | 2·87 |
| 44 | Do. ... | Yerrappakonda ... | 3088·00 | 4·82 |
| 45 | Do. ... | Malakavemula ... | 2760·00 | 4·31 |
| 46 | Do. ... | Gudduvelagala ... | 2488·00 | 3 89 |
| 47 | Do. ... | Nigidi Part | 2007·00 | 3.14 |
| 48 | Do. ... | Velichalamala ... | 3560·00 | 5·56 |
| | | Total | 31,159·63 | 48·67 |
| 49 | Gooty | Muchukota and Additions. | 21632·18 | 33 80 |
| 50 | Do. ... | Yellutla and Additions. | 9183·61 | 14 35 |
| 51 | Do. ... | Kunukuntla ... | 1616·00 | 2·53 |
| 52 | Do. ... | Chillavaripalle ... | 4980·00 | 7·78 |
| 53 | Do. ... | Dadithota and Additions. | 3541·52 | 5·53 |
| 54 | Do. ... | Neerajampalle ... | 2285·00 | 3·57 |
| 55 | Do. ... | Yellanur ... | 474·00 | 0·74 |
| 56 | Do. ... | Molakatalla ... | 3632·71 | 15·67 |
| 57 | Do. ... | Yadiki and Additions. | 9923·96 | 15·51 |
| 58 | Do. ... | Katrimala East and Additions. | 4775·08 | 7·46 |
| 59 | Do. ... | Katrimala West ... | 7342·69 | 11·47 |
| 60 | Do. ... | Jakkalacheruvu ... | 2468·40 | 3·86 |
| 61 | Do. ... | Nagasamudram South | 4087·50 | 6·39 |
| 62 | Do. ... | Nagasamudram North | 6992·55 | 10·93 |
| 63 | Do. ... | Kristipad ... | 869·19 | 1·36 |
| 64 | Do. ... | Teliki ... | 891·18 | 1·39 |
| 65 | Do. ... | Ravuludiki and Additions. | 1820·99 | 2·85 |
| 66 | Do. ... | Bhadrampalle ... | 3000·72 | 4·69 |
| 67 | Do. ... | Peddoddi and Additions. | 2553·68 | 3·96 |

## PAPER PLACED ON THE TABLE OF THE HOUSE

[Vide answer to Legislative Assembly Question No. 711 (Unstarred).]

STATEMENT SHOWING THE STAGE OF EACH LAND ACQUISITION CASE IN CERTAIN VILLAGES IN GANNAVARAM TALUK IN KRISHNA DISTRICT.

| S. No. (1) | Name of the Village. (2) | Purpose. (3) | State of action. (4) |
|---|---|---|---|
| 1. | Kalavapamula. | Provision of house-sites | The award enquiry in this case was completed by the Collector. But award could not be passed for want of allotment. |
| 2. | Kapileswarapuram. | do. | Award was passed on 20-6-1953 and notices have been got served on the awardees. But they did not turn up to receive payments. The amount was deposited under Revenue deposits and the Special Labour Inspector was asked to take possession of lands. Special Labour Inspector's Report is awaited. |
| 3. | Hanumanthapuram. | Provision of burial ground. | The Draft Declaration proposals are awaited from the Collector |

| | | |
|---|---|---|
| 4. Godduvarigudem hamlet of Aginiparru. | Provision of house-sites. | Acquisition of wet lands were sanctioned in this case. But dry lands are reported to be available and suitable for house-sites It is reserved for personal inspection by the District Welfare Officer, Krishna. |
| 5. Pudikondalapalem. | do. | It is still in the preliminary stage. The Special Labour Inspector has been asked to reconcile the variation in respect of Harijans for whom house-sites have to be provided. The Special Labour Inspector's report is awaited. |
| 6. Krishnapuram. | do. | The case is reserved for personal inspection by the District Welfare Officer, Krishna. |
| 7. Paidimukkala. | do. | The approved layout was forwarded to the Special Labour Inspector Gannavaram for submission of Draft Declaration Proposals and Sub-division record. They are awaited from the Special Labour Inspector. |
| 8. Inapur | Provision of burial ground to Harijans. | The award enquiry in this case was completed. But award could not be passed for want of allotment. |
| 9. Veeranki | Provision of burial ground. | This is reserved for personal inspection by the District Welfare Officer, Krishna. |

# PAPER PLACED ON THE TABLE OF THE HOUSE.

((Vide answer to Legislative Assembly Question unstarred No. 910.)

PARTICULARS OF THE UNSPENT AMOUNT AVAILABLE WITH EACH DISTRICT WELFARE OFFICER UNDER THE ALLOTMENT MADE DURING 1953—54 FOR THE ACQUISITION OF

| | House-Sites for Harijans. | Pathways, burial grounds etc , for Harijans. | Remarks. |
|---|---|---|---|
| 1. Nellore. | 7,518 12 0 | Nil. | |
| 2. West-Godavari. | Nil. | 5,420 0 0 | Rs. 30600/- has been completely spent. Rs. 60000/- additional allotment has been applied for. |
| 3. Cuddapah. | 25,055 3 2 | 1,939 13 10 | Amount will be spent before the end of this year. |
| 4. Kurnool. | 11,350 4 9 | 7,830 0 0 | This will be spent before the end of this year. |
| 5. Anantapur. | 3,931 0 0 | 3,528 0 0 | An additional sum of Rs. 3213-2-0 is necessary for the year. The entire amount will be spent. |
| 6. Chittoor. | 3,200 0 0 | No separate allotment for this purpose. | A sum of Rs. 1735/- will be spent before the year. |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | East Godavari. | 32,716 12 8 | 1650 0 0 | Amounts are likely to be spent before the year. |
| 8. | Guntur. | 9,721 10 8 | Additional allotment of Rs. 19949.1.0 has been applied for. | *This will be spent. Additional allotment has been applied for. |
| 9. | Krishna. | 23,484 12 6 Additional allotment applied for Rs. 1,15,566-5-6. | 12,383 0 1 Additional allotment applied for Rs. 69,139-0-7 | * (See above) |
| 10. | Srikakulam. | 2900 0 0 | No separate allotment for this purpose. | Amount surrendered. |
| 11. | Visakhapatnam. | 3,606 1 1 | No separate allotment under this head | The entire amount will be spent before the close of the year. |

## Clause B.

# PAPER PLACED ON THE TABLE OF THE HOUSE

(Vide answer to Legislative Assembly Unstarred Question No. 910).

Statement showing the number of awards ripe for passing and final payment pending with the District Welfare Officer, Krishna for want of allotment and the amount involved in each such case.

| S. No. | Name of the Taluk. | Name of the Village. | Purpose. | Expenditure involved. Cost of acquisition of house-sites. | Cost of streets, paths, burial-grounds etc. | Loans. |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1. | Gudivada | Tamarisa | House-sites | 1380 0 0 | 640 0 0 | 290 0 0 |
| 2. | " | Vanapamula | " | 2443 12 0 | 661 4 0 | — |
| 3. | Vijayawada | Vanukur | " | 8569 8 2 | 6374 14 1 | 6126 14 9 |
| 4. | " | Prasadampadu | " | 5476 3 0 | 2527 11 2 | — |
| 5. | " | Kowlur | " | 5723 8 10 | 2528 8 10 | 2109 9 7 |
| 6. | Gannavaram | Apparaopet | " | 2645 0 0 | 920 0 0 | — |
| 7. | Gudivada | Vinjarampadu | " | 1821 9 7 | 476 1 7 | — |
| 8. | Gannavaram | Kalavapamula | " | 453 2 8 | 1387 13 1 | 1893 13 4 |
| 9. | Nandigama | Pathavemavaram | " | 293 15 8 | 611 8 1 | 563 13 2 |
| 10. | " | Adiviravulapadu | " | 1201 0 0 | 491 10 0 | — |
| 11. | Divi | Pedamuttevi | " | 4512 0 5 | 2712 3 5 | — |
| 12. | " | Papavinasanam | " | 2837 10 0 | 705 8 5 | — |
| 13. | " | Devarakota | Burial ground | — | 1289 11 7 | — |
| 14. | Gannavaram | Yakamoor | House sites | 1600 0 0 | 2018 0 0 | 2700 0 0 |
| 15. | Gudivada | Bommulur | Burial ground | — | 975 0 0 | — |
| 16. | Gannavaram | Lankapalli | House sites | 2463 4 9 | 1741 6 2 | — |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 17. | Gannavaram | Lankapalli | Burial ground | — | | | 1150 | 0 | 0 | — | | |
| 18. | Vijayawada | Godavarru | House sites | — | | | 3314 | 4 | 10 | 7594 | 15 | 2 |
| 19. | Gannavaram | Katur | Pathway | — | | | 2007 | 0 | 0 | — | | |
| 20. | „ | Inapur | Burial ground | — | | | 621 | 0 | 0 | — | | |
| 21. | Gudivada | Maheswaram | House sites | 6704 | 8 | 0 | 4107 | 13 | 7 | — | | |
| 22. | Gannavaram | Atkur | „ | 93 | 11 | 7 | 499 | 13 | 7 | 1171 | 7 | 8 |
| 23. | Divi | Degalapalem | „ | 1269 | 10 | 2 | 627 | 2 | 9 | — | | |
| 24. | Vijayawada | Garikaparru | „ | 6721 | 4 | 7 | 3941 | 4 | 5 | 905 | 11 | 2 |
| 25. | Divi | Kummarapalem | „ | 2319 | 2 | 7 | 1419 | 14 | 4 | — | | |
| 26. | „ | Chinakallepally | Pathway | — | | | 845 | 4 | 0 | — | | |
| 27. | „ | Kummaragunta | House sites | 648 | 9 | 7 | 621 | 0 | 0 | 182 | 6 | 5 |
| 28. | Nandigama | Vemulapalli | „ | 1477 | 12 | 0 | 829 | 2 | 5 | — | | |
| 29. | Vijayawada | Kotikalapudi | „ | 4978 | 15 | 2 | 2131 | 7 | 3 | — | | |
| 30. | Divi | Narasannapalem | „ | 3243 | 0 | 0 | 1242 | 0 | 0 | 1584 | 4 | 0 |
| 31. | „ | Putchagadda | „ | 2000 | 0 | 0 | 800 | 0 | 0 | — | | |
| 32. | Gannavaram | Tarigoppala | „ | 2150 | 12 | 10 | 2258 | 13 | 6 | 2251 | 3 | 2 |
| 33. | Gudivada | Penjendra | „ | 1400 | 11 | 2 | 853 | 14 | 0 | — | | |
| 34. | „ | Dondapadu | Pathway | — | | | 496 | 0 | 0 | — | | |
| 35. | „ | Dekiparru | House sites | 11600 | 0 | 0 | 3200 | 0 | 0 | — | | |
| 36. | „ | Vuyyur | „ | 10276 | 15 | 7 | 7611 | 4 | 0 | 2206 | 4 | 0 |
| 37. | „ | Seepudy | „ | 1422 | 7 | 0 | 474 | 2 | 4 | — | | |
| 38. | „ | Kowtharam | „ | 3289 | 0 | 0 | 965 | 2 | 11 | — | | |
| 39. | „ | Elamarru | „ | 3901 | 15 | 2 | 1517 | 6 | 10 | — | | |
| 40. | Kaikalur | Prodduvaka | Latrine | — | | | 1546 | 0 | 0 | — | | |
| | | | Total | 104919 | 2 | 6 | 69437 | 2 | 5 | 28154 | 8 | 5 |

## BILLS INTRODUCED IN THE LEGISLATIVE ASSEMBLY OF THE STATE OF ANDHRA.

Under the proviso to rule 77 of the Assembly Rules, the following Bill, together with the Statement of Objects and Reasons, is published for general information :

*A Bill to authorize the appropriation of certain further moneys out of the Consolidated Fund of the State for the service of the half-year which commenced on the 1st October 1953.*

WHEREAS it is necessary to authorize the appropriation of certain further moneys out of the Consolidated Fund of the State for the service of the half-year which commenced on the 1st October 1953 ; It is hereby enacted as follows :—

1. *Short title.*—This Act my be called the Andhra Appropriation (No. 2) Act, 1954.

2. *Supplementary appropriation out of the Consolidated Fund for the half-year which commenced on the 1st October 1953.* The State Government may appropriate out of the Consolidated Fund of the State, for the half-year which commenced on the 1st October 1953, a further sum not exceeding six crores, fifty-one lakhs ninety-four thousand and three hundred rupees, being moneys required to meet —

(a) the supplementary grants made by the Andhra Legislative Assembly for the said half-year, as set forth in column(3) of the Schedule ; and

(b) the supplementary expenditure charged on the Consolidated Fund of the State for the said half-year, as set forth in column (4) of the Schedule.

## THE SCHEDULE

(See Section 2)

| Demand number. | Services and purposes. | Sums not exceeding: Voted by the Legislative Assembly. | Charged on the Consolidated Fund of the State. | Total. |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | | Rs. | Rs. | Rs. |
| VI | Motor Vehicles Acts | 6,000 | 600 | 6,600 |
| VIII | Irrigation | 9,88,700 | | 9,88,700 |
| | Debt charges | | 10,83,000 | 10,83,000 |
| IX | Heads of State Ministers and Headquarters Staff | 2,58,100 | | 2,58,100 |
| X | State Legislature | 1,79,400 | 800 | 1,80,200 |
| XII | Administration of Justice | 1,19,700 | | 1,19,700 |
| XIV | Police | 100 | | 100 |
| XV | Education | 7,69,200 | | 7,69,200 |
| XVI | Medical | 3,90,600 | | 3,90,600 |
| XVII | Public Health | 7,26,000 | | 7,26,000 |
| XIX | Veterinary | 1,93,900 | | 1,93,900 |
| XXII | Harijan Uplift | 11,77,600 | | 11,77,600 |
| XXIV | Civil Works—Works | 29,19,100 | 17,000 | 29,36,100 |
| XXVI | Civil Works-Grants-in-aid | 32,16,500 | | 32,16,500 |
| XXVII | Electricity | 3,20,800 | | 3,20,800 |
| XXVIII | Famine | 21,31,800 | | 21,31,800 |
| XXIX | Pensions | 1,63,000 | | 1,63,000 |
| XXX | Stationery and Printing | 3,66,600 | | 3,66,600 |
| XXXI | Miscellaneous | 7,26,800 | | 7,26,800 |
| XXXV | Capital Outlay on Irrigation | 13,27,000 | | 13,27,000 |
| XXXVII | Capital Outlay on Civil Works | 21,72,400 | 2,50,000 | 24,22,400 |
| XXXVIII | Capital Outlay on Electricity Schemes | 400 | | 400 |
| XLI | Capital Outlay on Schemes of State Trading. | 4,54,65,800 | | 4,54,65,800 |
| XLII | Loans and Advances by the State Government. | 2,23,400 | | 2,23,400 |
| | Grand Total. | 6,38,42,900 | 13,51,400 | 6,51,94,300 |

## STATEMENT OF OBJECTS AND REASONS.

This Bill is introduced is pursuance of Article 205 of the Constituation, read with Article 204 (1) thereof, to provide for the appropriation out of the Consolidated Fund of the State, of the moneys required to meet—

*(a)* the supplementary grants made by the Legislative Assembly for expenditure of the State Government, for the half-year which commenced on the 1st October 1953 ; and

*(b)* the supplementary expenditure charged on the said Fund for that half-year.

T. VISWANATHAM.
*Minister for Law and Finance.*

Under the proviso to rule 77 of the Assembly Rules, the following Bill, together with the Statement of Objects and Reasons, is published for general information —

*A Bill to authorize the appropriation of moneys out of the Consolidated Fund of the State for the service of the financial year commencing on the 1st April 1954.*

WHEREAS it is necessary to authorize the Appropriation of moneys out of the Consolidated Fund of the State for the service of the financial year commencing on the 1st April 1954; It is hereby enacted as follows :—

1. *Short title:*—This Act may be called the Andhra Appropriation (No. 3) Act 1954.

2. *Appropriation out of the Consolidated Fund for the financial year commencing on the 1st April 1954:*—The State Government may appropriate out of the Consolidated Fund of the State for the financial year commencing on the 1st April 1954, a sum not exceeding fifty-three crores thirty-five lakhs, nine thousand and four hundred rupees being moneys required to meet—

(a) the grants made by the Andhra Legislative Assembly for that year, as set forth in column (3) of the Schedule; and

(b), the expenditure charged on the Consolidated Fund of the State for that year, as set forth in column (4) of the Schedule.

# THE SCHEDULE

*(Section 2.)*

| Demand number. | Service and purposes. | Sums not exceeding. Voted by the Legislative Assembly | Charged on the Consolidated Fund of the State | Total |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | | Rs. | Rs | Rs. |
| I | Land Revenue ... | 57,81,800 | ... | 57,81,800 |
| II | Excise Department ... | 38,16,700 | ... | 38,16,700 |
| III | Stamps Administration ... | 11,32,600 | ... | 11,32,600 |
| IV | Forest Department ... | 27,48,600 | ... | 27,48,600 |
| V | Registration ... | 16,43,600 | ... | 16,43,600 |
| VI | Motor Vehicles Acts ... | 5,08,600 | 24,16,800 | 29,25,400 |
| VII | General Sales Tax and other taxes and duties ... | 52,82,600 | ... | 52,82,600 |
| VIII | Irrigation ... | 1,26,47,200 | 1,49,37,000 | 2,75,84,200 |
| | Debt charges ... | ... | 1,83,30,500 | 1,83,30,500 |
| IX | Heads of States, M inisters and headquarters staff ... | 40,59,000 | 6,50,100 | 47,09,100 |
| X | State Legislature ... | 18,37,500 | 24,100 | 18,61,600 |
| XI | District Administration and Miscellaneous ... | 2,72,38,500 | ... | 2,72,38,500 |
| XII | Administration of Justice ... | 61,52,800 | 30,000 | 61,82,800 |
| XIII | Jails ... | 14,08,400 | ... | 14,08,400 |
| XIV | Police ... | 2,63,23,200 | ... | 2,63,23,200 |
| XV | Education ... | 4,30,44,900 | ... | 4,30,44,900 |
| XVI | Medical ... | 1,01,46,100 | ... | 1,01,46,100 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| XVII | Public Health | ... | 57,88,800 | ... | 57,88,800 |
| XVIII | Agriculture and Fisheries | ... | 75,79,400 | ... | 75,79,400 |
| XIX | Veterinary | ... | 24,18,400 | ... | 24,18,400 |
| XX | Co-operation | ... | 56,20,000 | ... | 56,20,000 |
| XXI | Industries | ... | 50,41,200 | 1,69,100 | 52,10,300 |
| XXII | Harijan Uplift | ... | 56 21,000 | ... | 56 21,000 |
| XXIII | Labour, including Factories | ... | 6,49,000 | ... | 6,49,000 |
| XXIV | Civil Works—Works | ... | 2,92,17,100 | 1,67,000 | 2,93,84,100 |
| XXV | Civil Works Establishment and Tools and Plant | ... | 68,33,500 | ... | 68,33,500 |
| XXVI | Civil Works—Grants-in-Aid | ... | 39,51,000 | ... | 39,51,000 |
| XXVII | Electricity | ... | 93,37,300 | 1,05,71,900 | 1,99,09,200 |
| XXVIII | Famine | ... | 10,06.000 | 5,00,000 | 15,06,000 |
| XXIX | Pensions | ... | 80,73,500 | 1,33,500 | 82,07,000 |
| XXX | Stationery and Printing | ... | 17,48,900 | ... | 17,48,900 |
| XXXI | Miscellaneous | ... | 20,71,700 | ... | 20,71,700 |
| XXXII | Community Development Projects | ... | 36,15,200 | ... | 36,15,200 |
| XXXIII | Compensation to Zamindars | ... | 20,00,000 | ... | 20,00,000 |
| XXXIV | Capital Outlay on Irrigation | ... | 3,34,99,600 | ... | 3,34,99,600 |
| XXXV | Capital Outlay on Industrial Development | ... | 8,89,100 | ... | 8,89,100 |
| XXXVI | Capital Outlay on Civil Works | ... | 97,06,800 | 5,30,000 | 1,02,36,800 |
| XXXVII | Capital Outlay on Electricity Schemes | ... | 8,10,59,700 | ... | 8,10,59,700 |
| XXXVIII | Commuted value of pensions | ... | 7,36,000 | 4,000 | 7,40,000 |
| XXXIX | Capital Outlay on Schemes of State Trading | ... | 6,04,20,300 | ... | 6,04,20,300 |
| XL | Loans and advances by the State Government | ... | 2,03,49,800 | ... | 2,03,49,800 |
| | Public Debt—Repayment | ... | ... | 2,40,40,000 | 2,40,40,000 |
| | Grand Total | ... | 46,10,05,400 | 7,25,04,000 | 53,35,09,400 |

## STATEMENT OF OBJECTS AND REASONS.

This Bill is introduced in pursuance of Article 204, clause(1) of the Constitution to provide for the appropriation out of the Consolidated Fund of the State, of the moneys required to meet–

*(a)* the grants made by the Andhra Legislative Assembly for expenditure of the State Government for the financial year commencing on the 1st April 1954; and

*(b)* the expenditure charged on the Consolidated Fund of the State for the said financial year.

T. VISWANATHAM,
*Minister for Law and Finance.*